# నేర్చుకొనుటకు పశితనం ప్రతిబంధకంగాదు

మొక్కలకు అవి బ్రతికే నిమిత్తం నీళ్లు కావలెను అని చిన్న బాలురు పశితనమందే నేర్చుకుందురు. ఈ సామాన్యమైన యదార్థమును ఒక్క మాటు నేర్చుకుంటే ఇంకెన్నటికీ మరువరు.



మీ పిల్లలకు మీరు ఇప్పుడు నేర్పవలసిన మరియొక పాఠము. పళ్లు మరియు పనుచిగుళ్ల పట్ల రోజూ శ్రద్ధవహించుట, అందువల్ల భవిష్యత్తునందు కొన్ని సంవత్సరాలలో దంతక్షయం మరియు పనుచిగుళ్ల జబ్బులబారి బడకుండా వారిని కాపాడినందుకు వారు మీకు అభివందనములర్పింతురు. వారి పళ్లను మరియు పనుచిగుళ్లను ఫోర్‌హాన్స్ టూత్ పేస్టుతో తోముకొనుచూ భద్రపరచుకోమని మీ పిల్లలకు నేడే బోధించండి. దంత వైద్యుని చేత తయారు చేయబడిన ఫోర్‌హాన్స్' పనుచిగుళ్లకు గుణకారియైన డాక్టర్ ఫోర్‌హన్ యొక్క ప్రత్యేక పదార్థములు గల టూత్ పేస్టు ప్రపంచంలోకెల్ల ఇది ఒక్కటే. రోజూ వాడుచున్నయడల పళ్లు తెల్లగా మెరయుచూ, పనుచిగుళ్లు గట్టిగాను ఆరోగ్యవంతంగాను వుండును. "CARE OF THE TEETH AND GUMS" అనే చిన్న రంగుల పుస్తకం ఉచిత ప్రతి కోసం తపాలా ఖర్చుల నిమిత్తం 10 న.పై. తపాలా బిళ్లలను పంపండి: మేనర్స్' డెంటల్ అడ్వయిజరీ బ్యూరో, పోస్టు బ్యాగ్ నం 10031, బొంబాయి.




**COUPON**

Please send me a copy of the booklet
"CARE OF THE TEETH AND GUMS"

*Name* ..............................................

*Address* ..............................................

..............................................

# చందమామ

ఈ సంచికలో కథలు
వింతలు - విశేషాలు

★



ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో
ఆకర్షణలు.



# దిలీప్ బృందం

## సర్కస్‌కి వెళ్తున్నారు



























JWTUC 2244




ఎక్కడ
**లైఫ్‌బాయ్** వున్నదో
అక్కడ **ఆరోగ్యము** వున్నది

L. 47-77 T1

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

స్వాతంత్ర్య భారతానికి మరొక ఏడు నిండుతున్నది. స్వతంత్ర భారత చరిత్రలో నెహ్రూశకం ముగిసి, ఇప్పుడు లాల్ బహదుర్ శాస్త్రి శకం నడుస్తున్నది.

జరుగుతున్న చరిత్ర ఇలా ఉంటే జరిగిన చరిత్రను "చందమామ" పాఠకులు భారతచరిత్రలో దక్కను ప్రాంతం మొగలుసామ్రాజ్యంలో చేరడం గురించీ, నెహ్రూకథలో భారత జాతీయ సమరం తొలి ఉద్యమం గురించీ చదువుతారు.

ఈ సంచికలో "ఉత్తరకాండ" [రామాయణం] ఆరంభ మవుతున్నది. అలాగే "నవాబునందిని" కూడా ఆరంభ మవుతున్నది. ఇందులో దుర్గేశనందిని అనంతర కథ ఉన్నది. దీనిని రచించినవాడు దామోదర ముఖర్జీ.

సంపుటి : 37 - ఆగష్టు 1965 - సంచిక : 2

CHITRA



# భారత చరిత్ర



1627 అక్టోబరులో తన తండ్రి చనిపోయే నాటికి షాజహాఁ దక్కనులో ఉన్నాడు. అతని అన్నలైన ఖుస్రవ్, పర్వేజ్ అనే వాళ్ళిద్దరూ అప్పటికే చనిపోయారు. అతని తమ్ముడైన షారియార్ తన అత్తగారైన నూర్‌జహాఁ ప్రోత్సాహంతో తాను చక్రవర్తినని లాహోరు నుంచి ప్రకటన చేశాడు. ఆ తరుణంలో ముంతాజ్‌మహల్ తండ్రి అయిన ఆసఫ్‌ఖాన్ షాజహాఁకు బాసటగా నిలబడి, ఉత్తరదేశానికి వచ్చెయ్యమని షాజహాఁకు కబురు పంపి, అతను వచ్చే దాకా సింహాసనం మీద ఖుస్రవ్ కొడుకైన దావర్‌బక్ష్‌ను కూర్చోబెట్టాడు. తరవాత అతను లాహోరులో ఉన్న షారియార్ పైకి దాడి వెళ్ళి, యుద్ధంలో అతన్ని ఓడించి, అతని కళ్ళు తీసేయించాడు.

షాజహాఁ త్వరగా ఢిల్లీ చేరుకుని, 1628 ఫిబ్రవరిలో చక్రవర్తిగా అభిషిక్తుడయాడు. అటు పైన అతను తన పదవికి అడ్డంగా ఉన్న వారందరినీ లోకాంతరాలకు పంపేశాడు. పరిస్థితులు అతనికి బాగా అనుకూలించాయి. అతనికి సహాయపడిన ఆసఫ్‌ఖాన్ ప్రధానమంత్రి అయాడు. అదే విధంగా మహాబత్‌ఖాన్ అనేవాడు అజ్మీరుకు గవర్నరుగా నియమించబడ్డాడు.

చక్రవర్తి పై ఇద్దరు వ్యక్తులు తిరుగుబాటు చేశారు. ఒకడు బుందేలా రాజైన జుఝార్‌సింగు, రెండవ వాడు ఖాన్‌జహాఁ లోడీ అనే అఫ్ఘాను ప్రముఖుడు, మాజీ దక్కను వైస్రాయి. షాజహాఁ గద్దె ఎక్కిన రెండేళ్ళలోనూ ఈ రెండు తిరుగుబాట్లూ జరిగి, అణచివేయబడ్డాయి. ఇందులో రెండో తిరుగుబాటు బలీయమైనది; దానికి నిజాముల్‌ముల్క్ అనే అహమ్మద్‌నగరు నవాబూ, మహారాష్ట్రులూ, రాజపుత్రులూ సహాయపడ్డారు. అయితే షాజహాఁ ఈ తిరుగు

47. షాజహాఁ

బాటు బలాన్ని గుర్తించి, తగిన బలాన్ని ప్రయోగించి తిరుగుబాటు దారును సమూలంగా నాశనం చేశాడు.

బెంగాలులో సాత్‌గాంవ్ వద్ద స్థిరపడిన పోర్చుగీసు వారు తమ వ్యాపార మేదో తాము చూసుకోక, హుగ్లీ వద్ద బలమైన స్థావరం ఏర్పాటు చేసుకుని చక్రవర్తికి విరుద్ధమైన చర్యలకు దిగారు. వారు పుగాకు వర్తకుల వద్ద సుంకాలు వసూలు చెయ్యటమే గాక, బానిస వ్యాపారం కూడా సాగించి, ముంతాజ్ మహల్ వద్ద ఉండే ఇద్దరు బానిస యువతులను పట్టుకున్నారు. షాజహాఁ ఉత్తరువుపై 1632 జూను 24 న మొగలుసైన్యాలు హుగ్లీని ముట్టడించాయి. యుద్ధంలో అనేక మంది పోర్చుగీసు వారు చచ్చారు. చాలా మంది ఖైదీలుగా ఆగ్రాలో యమయాతన లనుభవించారు.

తన తండ్రి తాతల లాగే షాజహాఁ కూడా తన సామ్రాజ్యాన్ని దక్షిణాన విస్తరింపజేయ యత్నించాడు. నిజాంషాహీల పరిపాలన కింద ఉండిన అహమ్మద్‌నగరు మొగలు సరిహద్దుకు సన్నిహితంగా ఉండటం చేత దానికి మొగలుల తాకిడి జాస్తిగా ఉండేది. 1626 నాటికి మలిక్ అంబరు చనిపోయాడు; అతని కొడుకు ఫతేఖాన్ అప్రయోజ



కుడు కావటాన అహమ్మద్‌నగరు రాజ్యం దుర్బలమై ఉన్నది. అహమ్మద్‌నగరు సుల్తాను పై ద్రోహం చేసి ఫతేఖాన్ మొగలులతో చేరి, సుల్తానును చంపి, పదేళ్ళ వయసు గల సుల్తాను కొడుకును పేరుకు గద్దె మీద ఉంచి తానే అధికారం చెలాయించాడు. 1631 లో ఈ నీచుడు మొగలుల వద్ద పదిన్నర లక్షల రూపాయలు లంచం పుచ్చుకుని దౌలతాబాదు కోటను వారి వశం చేశాడు. 1633 లో అహమ్మదునగరు మొగలు సామ్రాజ్యంలో చేరిపోయింది.

గోల్కొండ, బిజాపూరు రాజ్యాలు స్వతంత్రంగా ఉండటమూ, వాటి పాలకులు షియా

తెగకు చెందినవారు కావటమూ షాజహాఁ సహించలేక పోయాడు. 1629 లో గోల్కొండ మీదా, 1631 లో బిజాపూరు మీదా మొగలు సైనిక చర్యలు ప్రారంభ మయాయి. 1635 లో ఈ రెండు రాజ్యాల పాలకులూ షాహజీకి రహస్యంగా సహాయ పడ్డారు; ఇది తెలిసి షాజహాఁ ఈ దేశాల వారిని తనకు లోబడి ఉండమనీ, కప్పం కట్టమనీ, షాహజీకి సహాయం చెయ్యగూడ దనీ ఆదేశించటమే గాక, తానే స్వయంగా సేనలతో బయలుదేరి వచ్చి, 1636 ఫిబ్రవరి 21 న దౌలతాబాదు చేరాడు. ఇది చూసి బేజారెత్తి, గోల్కొండ సుల్తాను అబ్దుల్లాషా లొంగిపోయి, షరతు లామోదించాడు.

కాని బిజాపూరు సుల్తాను ఆదిల్‌షా యుద్ధసన్నద్ధు డయాడు. బిజాపూరును మూడు పక్కల నుంచి మూడు మొగలు సేనలు ముట్టడించాయి. బిజాపూరు సైని కులు తమ రాజధానిని రక్షించుకో గలిగారు గాని మిగతా రాజ్యాన్ని మొగలులు కొల్ల గొట్టారు. 1636 లో బిజాపూరు సుల్తాను సంధికి ఒడబడ వలిసి వచ్చింది. అతను ఢిల్లీ చక్రవర్తికి లోబడి ఉండటానికి సమ్మతించాడు.

ఈ విధంగా దక్కను రాజ్యాలు కూడా మొగలు సామ్రాజ్యంలో అంతర్భాగ లయాయి. షాజహాఁ 1636 జులై 11 న దక్కను నుంచి తిరిగి వెళ్ళిపోయి, దక్కనులో వైస్రాయిగా పనిచెయ్యటానికి తన మూడవ కొడుకైన ఔరంగజేబును పంపాడు. మొగలు సామ్రాజ్యం యొక్క దక్కను విభాగంలో ఆనాడు ఖాన్‌దేశ్, బిరార్, తెలంగాణా, దౌలతాబాదు రాష్ట్రా లుండేవి; వాటిపై రాబడి సాలుకు 5 కోట్ల రూపాయ లుండేది; అందులో 64 కొండ దుర్గా లుండేవి, వాటిలో కొన్ని ఇంకా షాహజీ లాంటి శత్రు నాయకుల అధీ నంలో ఉండేవి.



# నేహ్రూ కథ

## 14.



**1920** ఆగస్టు 10న మిత్రరాజ్యాల వారు టర్కీ పైన ఒక ఒప్పందం రుద్ది ఖలీఫా అధికారాలను తగ్గించటం భారత దేశం లోని ముస్లిములను కలవరపరిచింది. పంజాబు దురంతాలతో భారతీయులు కుమిలిపోతున్నారు. ఈ అక్రమాలన్నిటినీ చక్కబరచటానికి అహింసాయుతమైన తిరుగుబాటు చెయ్యవలిసిందని గాంధీజీ దేశప్రజలకు పిలుపు ఇస్తూ దేశ పర్యటన చేశాడు. అలీసోదరులు ఆయన వెంట తాము కూడా పర్యటించారు. ఎక్కడ విన్నా "హిందూ ముసల్మాన్‌కీ జై!" అన్న నినాదం మారుమోగింది.

గాంధీజీ ప్రతిపాదించిన సహాయనిరాకరణం గురించి చర్చించటానికి కలకత్తాలో 1920 శీతాకాలంలో కాంగ్రెసు అవసర సమావేశం జరిగింది. దానికి లాలాలజ్‌పత్ రాయ్ అధ్యక్షత వహించాడు.

కలకత్తా సమావేశంలో లాలాజీ సహాయ నిరాకరణోద్యమాన్ని ఖండిస్తూ, అది అవాస్తవికమనీ, ఆచరణ యోగ్యం కాదనీ అన్నాడు. అనేక మంది పాత కాంగ్రెసు నాయకులు ఆయనతో ఏకీభవించారు. వారిలో దేశబంధుదాస్, అనీబిసెంటూ, మహమ్మదాలీ జిన్నా ఉన్నారు. (దీని అనంతరమే డిసెంబరులో జరిగిన కాంగ్రెసుతో జిన్నా తెగతెంపులు చేసేసుకున్నాడు.) చిత్తరంజనదాసు సహాయ నిరాకరణోద్యమానికి అభ్యంతరం చెప్పలేదు; కొత్త సంస్కరణల కింద ఏర్పడనున్న శాసన సభలను బహిష్కరించటానికి ఆయన వ్యతిరేకించాడు.

కలకత్తా సమావేశానికీ, నాగపూరు సమావేశానికీ మధ్య ఉండిన మూడు మాసాల వ్యవధిలో గాంధీజీ మరొకసారి దేశపర్యటన





గాంధీజీ భారతీయులను ఉద్బోధిస్తూ శాసనసభలను బహిష్కరించ మన్నాడు. వాళ్ళు అలాగే బహిష్కరించారు.

కలకత్తాలో జరిగిన అవసర సమావేశం తోనే కాంగ్రెసు చరిత్రలో గాంధీ శకం ఆరంభ మయింది. దానికి హాజరైన వారిలో అధిక సంఖ్యాకులు ఖద్దరు ధరించి, హిందూస్తానీ భాష మాట్లాడే వాళ్ళు. జిన్నాకు కాంగ్రెసు రాజకీయాలే గాక కాంగ్రెసు వాతావరణం కూడా పడలేదు. మితవాదులు పూర్తిగా ప్రభుత్వ పక్షమై పోయారు.

మోతీలాల్ గాంధీజీ మార్గం తొక్క నిర్ణయించిన తరువాత ఆయన జీవితంలో పెద్ద మార్పులు వచ్చాయి. ఆయన తన ప్రాక్టీసు తో బాటు అంతులేని రాబడిని వదులుకోవలిసి వచ్చింది, విదేశీ వస్తువులు బహిష్కరించ వలిసి వచ్చింది, తన బ్రిటిషు మిత్రులతో సంబంధాలు మానుకో వలిసి వచ్చింది, తన చిన్న కూతురు కృష్ణను బ్రిటిషు పాఠశాల మాన్పించి, ఇంట్లోనే ట్యూటర్లను పెట్టవలిసి వచ్చింది.

1920 డిసెంబరు 26 న నాగపూరులో అసలు కాంగ్రెసు సమావేశం విజయరాఘవాచారయ్యారుగారి అధ్యక్షతన జరిగింది. ప్రారంభ దశలో సహాయ నిరాకరణ తీర్మా

చేసి, తన సందేశాన్ని అన్ని తరగతుల వారికీ వినిపించాడు. ఆ సందేశం అమోఘంగా పని చేసింది. కొత్త సంస్కరణల కింద ఏర్పడ నున్న శాసనసభలకు నవంబరులో ఎన్నికలు జరిగాయి. లండను లోని "టైమ్స్" పత్రిక విలేఖరి అలహాబాదు సమీపంలో ఎన్నికలు చూసి ఇలా రాశాడు: "ఇండియా లోని ప్రజలకు స్వపరిపాలన నేర్పడానికి సాగించిన కృషికి ఇదే ఆరంభ మనటానికి ఆధారం ఏమీ కనబడదు... ఉదయం ఎనిమిది లగాయతు మధ్యాన్నం పన్నెండు దాటిన దాకా కూడా ఒక్కడైనా వచ్చి వోటు వెయ్యలేదు."



నానికి చిత్తరంజనదాను అనేక అభ్యంత రాలు తెలిపాడు. జిన్నా వాటిని బలపరిచాడు. కోర్టులను బహిష్కరించడం అన్నిటి కన్న పెద్ద అభ్యంతరం. కాని అత్యధిక సంఖ్యాకులు గాంధీ పక్షాన నిలబడ్డారు. చిట్టచివరకు కొద్దిపాటి సవరణలతో నాగపూరు తీర్మానం కాంగ్రెసు సభలో ప్రతిపాదించబడి ఆమోదించబడింది. దాన్ని ప్రతిపాదించిన వాడు దాసే.

"విప్లవ వాతావరణంలో విప్లవ వ్యతిరేకులకు ఊపిరి సలపదు. దాన్ని బలపరిచే వారికి నూతనోత్సాహ శక్తులు వచ్చినట్టవుతుంది...1921 లో కాంగ్రెసు కార్యక్రమం కోసం పనిచేసిన మాలో చాలా మందిమి కైపు లాటి స్థితిలో జీవించాం," అంటాడు జవాహర్. ఒక గొప్ప లక్ష్యం కోసం పాటు పడుతున్న ఆనందం, ఎలాటి సందేహాలూ లేకపోవటం, ముందు దారి స్పష్టంగా గోచరించటం, ఇతరుల ఉత్సాహంలో పాల్గొనటం, పెద్ద బరువు దిగిపోయినట్టుండి మనసు ఉల్లాసంగా ఉండటం—ఇవన్నీ జవాహర్ అనుభవించాడు. ప్రభుత్వంతో తలపడి జైళ్ళకు పోయేక్షణం దగ్గిరపడుతున్నది. జవాహరు ప్రభృతులు ఎన్నడూ లేనంత హెచ్చుగా శ్రమించారు.



భారతదేశ స్వరూపం కళ్ళ ఎదట మార్పు చెందుతున్నది. స్వరాజ్యం అందుబాటు లోకి వస్తున్నట్టు కనిపించింది. "నా పిలుపును అందరూ అందుకుంటే ఏడాదిలో స్వరాజ్యం వస్తుంది," అని గాంధీజీ కాంగ్రెసు సమావేశంలో అని ఉన్నాడు. ప్రభుత్వం ఆందోళనలో పడింది. 1921 డిసెంబరులో వైస్రాయిగా ఉండిన లార్డ్ రీడింగ్, తాము "విస్తుపోయి అయోమయంలో" పడ్డామని ఒప్పుకున్నాడు. అధికారులు కంగారు పడటానికి కారణం ఉద్యమం ఉప్పెనలాగా చుట్టుకుంటున్నది, అయితే అది శాంతియుతం కావటం

చేత దాన్ని దౌర్జన్యంగా అణచటానికి తగిన ఆధారాలు ప్రభుత్వానికి చిక్కలేదు.

ఇంగ్లీషువాళ్ళు ఈ ఉద్యమం అహింసా యుతంగా ఉంటుందని నమ్మలేదు. దౌర్జన్యం అగ్నిపర్వతం లాగా పేలుతుందని వారి భయం. ఇందు కొక మంచి తార్కాణం జవాహరు తన స్వీయ చరిత్రలో చెప్పాడు.

1921 మే లో స్వరూప్ (విజయలక్ష్మి పండిట్) పెళ్ళి నిశ్చయమయింది. లగ్నం పంచాంగాన్ని బట్టి పెడితే అది మే 10 న అయింది. పెళ్ళికి గాంధీజీనీ, అలీసోదరులు మొదలుగా గల ఇతర కాంగ్రెసు పెద్దలనూ ఆహ్వానించారు. వారికి వీలుగా ఉంటుంది గదా అని ఆ సమయంలోనే వర్కింగు కమిటీ సమావేశం అలహాబాదులో ఏర్పాటు చేశారు. పెద్ద నాయకులందరూ అలహాబాదు వస్తుంటే ఆ అవకాశాన్ని పోనివ్వటం దేని కని స్థానిక కాంగ్రెసువాదులు జిల్లా సమావేశం ఏర్పాటు చేశారు. దానికి చుట్టు పక్కల పల్లెటూళ్ళ నుంచి కిసానులు అధిక సంఖ్యలో హాజరయే అవకాశాలున్నాయి.

అలహాబాదు చాలా సందడిగా తయారయింది. ఇదంతా చూసి అలహాబాదులో ఉండే ఇంగ్లీషువాళ్ళు కంపరమెత్తి, ఏదో దారుణం జరగబోతున్న దనుకున్నారు. వారు తమ పనివాళ్ళనే నమ్మలేక జేబుల్లో రివాల్వరులు పెట్టుకుని తిరగసాగారు. అకస్మికంగా పితూరీ లేస్తే తెల్లవాళ్ళను రక్షించటానికి కోటలో పెద్ద ఎత్తున ఏర్పాట్లు కూడా జరిగినట్టు విని జవాహర్ ఆశ్చర్యపోయాడు. మూర్తీభవించిన అహింస లాటి గాంధీజీ వస్తుంటే హత్యాకాండ జరుగుతుందని తెల్లవాళ్ళ కీ కంపరం దేనికి? కాని తీరా విచారించగా తెలిసింది—మే 10 మీరట్‌లో తిరుగుబాటు జరిగిన రోజు! మోతీలాల్ కూతురి పెళ్ళి వంక పెట్టి 1857 నాటి సిపాయీల తిరుగుబాటు యొక్క వార్షిక దినం చేస్తారని తెల్లవాళ్ళు హడలిపోయారు!





# నవాబు నందిని

మందారణ దుర్గం తిరిగి ఎప్పటిలాగే ఉన్నది. దాని పక్కన మామిడితోటా, దుర్గం కిందుగా ప్రవహించే దామోదరనదీ పూర్వం ఉండినట్టే ఉన్నాయి. ఆ కాళ రాత్రి విమల చేసిన పొరపాటు వల్ల పఠానులు దుర్గంలో ప్రవేశించి ఎంత భీభత్సం చేశారు! ఎంత కోలాహలం! ఎంత రక్తపాతం! ఆ రాత్రే దుర్గేశుడైన వీరేంద్రసింహుడు పఠానులకు బందీగా దొరికాడు; తన ప్రియురాలైన తిలోత్తమను ఒక్కసారి చూసి పోదామని వచ్చిన జగతసింహుడు దాదాపు ప్రాణం పోయిన దాకా పోరాడి, చివరకు శత్రువులకు చిక్కాడు; వీరేంద్రసింహుణ్ణి శత్రువులు చంపేశారు; విమల పఠానులకు నవాబైన కతలూఖాన్‌ను చంపి పగ తీర్చుకున్నది. ఎన్నో విపరీతమైన సంఘటనలు కొద్ది రోజుల వ్యవధిలో జరిగి పోయాయి.

కాని ఇప్పుడు వాటి చిహ్న లేవీ లేవు. మందారణ దుర్గం ఎప్పటి లాగా మనోహరంగా, ప్రశాంతంగా ఉన్నది. మార్పల్లా ఏమిటంటే వీరేంద్రసింహుడు లేడు; విమల ఇప్పుడు వితంతువు. నిజానికి విమల ఏం సుఖపడింది? తాను ప్రేమించిన భర్త పట్ల భార్యగా ప్రవర్తించటాని కామె నోచుకోలేదు, అతని ఇంటి పరిచారికగా మసలుకున్నది. చివరకా భర్త కూడా పోయాడు. కాని విమలకు తృప్తి కలిగించే విషయాలు లేకపోలేదు. తన భర్తను చంపిన కిరాతకుణ్ణి, కతలూఖాన్‌ను తన చేత్తో పొడిచి

దామోదర ముఖర్జీ





కాని తిలోత్తమ ఎలాటి కళంకమూ కలగకుండా ఆ పాపకూపం నుంచి బయట పడగలిగింది; అది ఒక సంతోష కారణం. అలాగే, ఆమె ప్రియుడైన యువరాజు జగతసింహుడు మృత్యుముఖం నుంచి బయట పడటం మరొక సంతోష కారణం. అన్నిటినీ మించిన సంతోష కారణం తిలోత్తమ జగతసింహుడికి భార్య కావటం.

పఠానులు ఓడిపోయాక మానసింహ మహారాజు మందారణ దుర్గం వీరేంద్రసింహుడి భార్య అయిన విమలకూ, కుమార్తె అయిన తిలోత్తమకూ చెందే లాగు ఆజ్ఞ ఇచ్చాడు.

జగతసింహుడికీ, తిలోత్తమకూ వివాహమై ఇంకా పూర్తిగా నెల కాలేదు. అపరాహ్ణం వేళ అంతఃపురం పై భాగాన జగతసింహుడు ఏదో ఆలోచనలో మునిగి ఉండి అటూ ఇటూ పచారు చేస్తున్నాడు. అతని ఆలోచనకు కారణం ఉన్నది. దారుకేశ్వరనదీ తీరాన శిబిరం ఏర్పాటు చేసుకుని సైన్యంతో సహా ఉంటూ వచ్చిన మానసింహుడు, పఠానుల అల్లరి అణగారిపోగానే శిబిరం ఎత్తేసి పాట్నాకు వెళ్ళిపోయాడు. ఆ సమయంలో జగతసింహుడు శిబిరానికి వెళ్ళి తన తండ్రిని కలుసుకోలేదు. ఇప్పు

చంపింది. విమలకు మరొక సంతోష కారణం కూడా ఉన్నది: తాను గారాబంగా పెంచి పెద్దచేసిన తిలోత్తమ-తన పెంపుడు కూతురు—రాజా మానసింహుడికి కోడలయింది; ఆమె గర్భవాసాన పుట్టే కొడుకు అంబరు రాజవుతాడు! ఇది తక్కువ సంగతా?

తిలోత్తమకు కూడా విచార కారణాలున్నాయి. ఆమె తన తండ్రిని పోగొట్టుకున్నది; పాపపూరితమైన కతలూ ఖాన్ విలాస గృహంలో బందీగా ఉన్నది—అలాటి దుర్గతి పట్టిన వారెవరూ తమ మానాన్ని రక్షించుకుని బయట పడలేరు.



డతనికి వేరే పని ఏదీ లేని కారణం చేత తన భార్యతో కలిసి సుఖ సముద్రంలో ఓల లాడుతున్నాడు.

కొద్ది సేపటికి అత నున్న చోటికి తిలోత్తమ వచ్చింది. వారు ప్రేమసల్లాపా లాడు కుంటూ తమ ఇద్దరిలో ఎవరిది ఎక్కువ అదృష్ట మనే విషయమై తర్కించు కున్నారు. తనదే ఎక్కువ అదృష్ట మని జగతసింహు డంటే తనదే హెచ్చు అదృష్ట మనటానికి తిలోత్తమ కారణాలు చెప్పింది. జగతసింహుడు అంబరురాజు కొడుకు; అందం లోనూ, శౌర్య పరాక్రమాల లోనూ సాటిలేనివాడు; తాను ఒక చిన్న భూస్వామి కుమార్తె, అతనికి పాదదాసిగా ఉండటానికి తగనిది.

అంతతో పోనివ్వక తిలోత్తమ తన కోసం జగతసింహుడు చేసిన సాహసాలను ఏకరువు పెట్టింది; "వీరాధివీరులై ఉండి కూడా నన్నొక సారి చూడా లన్న కోరికతో అర్ధ రాత్రి వేళ దొంగ లాగా దుర్గంలో ప్రవేశిం చారు. నాతో రెండు మాటలు మాట్లాడటం కోసం పరాయి వాళ్ళ అంతఃపురంలో ప్రవే శించారు. నా ప్రాణాన్ని కాపాడటం కోసం మీ రక్తం ధారపోసి, ప్రాణా లర్పించటానికి కూడా సిద్ధపడ్డారు. నన్ను పెళ్ళాడి,



నా ప్రేమ కోసం మీ తండ్రిగారి ఆగ్రహానికి కూడా మిమ్మల్ని మీరు గురి చేసుకు న్నారు," అన్నది.

తిలోత్తమ మానసింహుడి ఆగ్రహం గుర్తు చెయ్యగానే జగతసింహుడు కలవర పడ్డాడు. "ఇది చాలా పెద్ద సమస్య. దీన్ని గురించి ఏం చెయ్యాలో ఆలోచించాలి," అన్నా డతను.

తిలోత్తమ ఈ మాటలు విని ఏమీ అన లేకపోయింది. ఆమె ముఖం ముడుచుకు పోయింది.

"మా నాన్నకు నా పైన కోపం ఉన్నది. అది నాకు తెలుసును. ఆయన తన కోపాన్ని



పైకి ప్రకటించలేదు, ఇతరుల ద్వారా చెప్పించనూ లేదు. అయినప్పటికీ ఆయనకు కోపం వచ్చిం దనటానికి లక్ష సూచనలున్నాయి," అన్నాడు జగతసింహుడు.

"అయితే మీరు జాగ్రత్తపడ రెందుకూ?" అని తిలోత్తమ అడిగింది.

"జాగ్రత్తా? ఎంత అమాయకురాలివి! నీ ప్రేమలో ఓలలాడే వాడు మృత్యువు ఎదట వచ్చి నిలబడితే మటుకు లక్ష్య పెడతాడా? నేను జాగ్రత్త గురించి ఆలోచించటమే లేదు," అన్నాడు జగతసింహుడు.

"అయితే ఏమి టాలోచిస్తున్నారు?" అని ప్రశ్నించింది తిలోత్తమ.



"రెండు విషయాలను గురించి ఇప్పుడాలోచించాలి. మా నాన్న రాజపుత్ర వీరుడు. చెయ్య దలచిన పనిని వాయిదా వెయ్యడు. ఆయనను అడ్డేవా డెవడూ లేడు. అక్బరు పాదుషాయే ఆయన మనసు కనిపెట్టిపోతా డంటే ఇంక ఇతరుల సంగతి చెప్పే దేమిటి? అందుచేత ఆయన నాకు మరణ శిక్ష విధించినా దానికి తిరుగుండదు...భయపడకు, నాకు చావుభయం లేదు. రాజపుత్రుడికి మరణ భయం లేదు. కాని మరణం వల్ల కలిగే వియోగ బాధ గురించే నాకు భయం," అన్నా డతను.

"వియోగ భయం నా కేమీ లేదు. వీరుల లాగే వీరపత్నులు కూడా నవ్వుతూ ప్రాణాలు విడవగలరు," అన్నది తిలోత్తమ.

"సరే, ఆ భయం లేదనుకుందాం. అంతకన్న పెద్ద భయం మరొక టున్నది. మా తండ్రి నా ప్రాణం ఒక్కమారుగా తీయక, అంతకన్న కఠోరంగా నన్ను తీవ్రమైన యాతనకు గురి చెయ్యవచ్చు."

"అదెలా?" అన్నది తిలోత్తమ కంపిస్తూ.

"మన వివాహం ఇష్టంలేక మన ఇద్దరినీ ఆయన వేరు చేసెయ్యవచ్చు."

ఈ మాట విని తిలోత్తమ కళ్ళనీరు కారుస్తూ, "నా మారుతల్లి విమల శాస్త్రో





క్తంగా మా తండ్రిని వివాహం చేసుకుని కూడా, మా ఇంట దాసీగా కాలం పుచ్చింది. మామగారింట నా కటువంటి స్థానమైనా దొరకదా?" అన్నది.

"భయపడకు, తిలోత్తమా. అకారణంగా నీ మనస్సును క్షోభపెట్టుకోకు. అంత దాకా వస్తే మనం మానవ సమాజాన్ని విడిచి పెట్టేసి, ఎక్కడో సముద్ర తీరాన, ఏ చెట్టు నీడనో సుఖంగా కాపరం చేద్దాం. అయినా మా తండ్రి తలుచుకుంటే అయన చెయ్య లేని దంటూ ఉండదు. అందుచేత ఆయ నను సుముఖుణ్ణి చేసుకోవటానికి అన్ని విధాలా ప్రయత్నిస్తాను. ఆ పైన దేవు డున్నాడు!" అన్నాడు జగతసింహుడు.

"ఏ దారీ లేకపోతే మరణం ఉండనే ఉన్నది," అన్నది తిలోత్తమ గుండె రాయి చేసుకుని.

ఆ రాత్రి ఆ భార్యాభర్తలకు విచారం మూలాన, ఎంత ప్రయత్నించినా కునుకు పట్టలేదు. చివరకు తెల్లవారుజామున తిలో త్తమ కళ్ళు మూసి నిద్రపోయింది. జగత సింహుడు ఆమెకు నిద్రా భంగం కలగ కుండా పక్కమీది నుంచి లేచి, చల్లగాలికి గుర్రం మీద తిరిగి వచ్చి కొంత శాంతి పొందుదా మనుకున్నాడు.




అతను తన తెల్ల గుర్రం ఎక్కి కోట ద్వారం దాటివచ్చి వెనక్కు తిరిగి చూశాడు. తిలోత్తమ శయన మందిర గవాక్షం వద్ద నిల బడి అతన్ని చూస్తున్నది. "లోపలికి వెళ్ళు. నే నిప్పుడే వస్తాను," అని చేతితో సైగ చేసి, జగతసింహుడు గుర్రాన్ని ముందుకు నడి పించాడు. కొద్ది దూరం పోయి వెనక్కు తిరిగి వద్దామని అతని సంకల్పం.

ఆ నాటి భయంకరమైన రాత్రి అతను విమల తెచ్చిన బల్లెంతో ఒక పఠాను వాణ్ణి చంపిన మామిడితోట కుండా అతను పోతూ ఉంటే గజపతి విద్యాదిగ్గజుడు—"రసిక రాజు" కనిపించాడు. అతని వేషం కొంత





హిందువులది గానూ, కొంత ముసల్మానులది గానూ ఉన్నది. అతను జగతసింహుణ్ణి చూసి, "ఖుదానారాయణుడు మీకు మేలు కలిగించుగాక!" అన్నాడు.

"గజపతి విద్యాదిగ్గజుడా!" అన్నాడు జగతసింహుడు ఆశ్చర్యంతో.

"ఔను, స్వామీ. వెనక వ్యాకరణం మొదలైనవి నేర్చాను. ఇప్పుడు ఉర్దూ కూడా నేర్చుకున్నాను. ఇక నా ఖ్యాతికి ఢోకా ఉండదు," అన్నాడు దిగ్గజుడు.

"ఈ వేష మేమిటి?"

"ఆ పాయ్యే పఠానులు ఊరికే పోక నా జాతీ, నా వేషమూ కూడా మార్చేసి మరీ పాయ్యారు. నేను మా గురువుగారి దగ్గిరికి వెళ్ళి పాఠం చెప్పమంటే, మూడు రోజులు గంగా తీరాన ఉండి, గంగా స్నానం చేసి, తల గొరిగించి, పిలక పెట్టుకుని వస్తేనే గాని పాఠం చెప్ప నన్నాడు. అలాగే చేసి వస్తున్నాను."

"మరి దుస్తులు?"

"ఏం చెయ్యను? నా బట్టలన్నీ పఠానులు కాజేశారు."

జగతసింహుడు దిగ్గజుడి చేతిలో ఒక రూపాయి పెట్టి, ముందుకు పోయాడు. అతను కొంత దూరం పోయే సరికి దూరంగా శైలేశ్వర మందిరం కనిపించింది. శైలేశ్వరుడి దర్శనం చేసుకుని, నమస్కారం చేసి రావటాని కతడు నిశ్చయించుకున్నాడు.

ఇంతలో గుర్రపు డెక్కల చప్పుడు వినిపించింది. దూరంగా గాలిలోకి దుమ్ము లేస్తున్నది. ఎవరో సైనికుల లాగున్నారు. వాళ్ళు పఠాను సైనికులు కావటానికి వీల్లేదు. పఠాను లందరూ ఒరిస్సాకు వెళ్ళిపోయారు. దేశంలో సైనికు డంటూ ఉంటే వాడు పాదుషా సైనికుడే.

త్వరలోనే అతను సైనికులను చూశాడు. వారు మానసింహుడి సైనికుల లాగా ఉన్నారు. సుమారు యాభై మంది ఉన్నారు.



వారి ముందు నడుస్తున్న నాయకుడు ఆజ్ఞాపించే సరికి సైనికు లందరూ గుర్రాలు నిలిపి ఒరల నుంచి కత్తులు దూసి భుజాల పై పెట్టుకుని, "అక్బరు పాదుషాకు జయం! రాజా మానసింహుడికి జయం!" అని నినాదాలు పలికారు.

జగతసింహుడు కూడా కత్తి తీసి, అలాగే నినాదాలు పలికి, సైనికుల నాయకుణ్ణి, "ఇదేమిటి, మత్రాసింగ్? పాదుషా వారికి కుశలమా? మహారాజుగారు కులాసాగా ఉన్నారా?" అని అడిగాడు.

మత్రాసింగు యువరాజును సమీపించి, ఒక రుమాలు నుంచి ఒక పత్రం తీసి, సవినయంగా అతనికి అందించాడు.

"ఏమిటి మహారాజుగారి ఆజ్ఞ?" అని జగతసింహు డడిగాడు.

"నేను తమ దాసుణ్ణి. నన్ను క్షమించాలి. మహారాజుగారు తమర్ని ఉన్న పాళంగా తీసుకు రమ్మని ఆజ్ఞాపించారు."

"ఎక్కడికి వెళ్ళాలి?"

"పాట్నాకు. అక్కడే ఉన్నారు మహారాజుగారు."

"ప్రయాణసన్నాహ మేమైనా చేసుకో వచ్చునా?"

"క్షమించాలి, యువరాజా. మీరు మా వెంట వెంటనే బయలుదేర నట్టయితే



బందీగా తీసుకురమ్మని మహారాజుగారి ఆజ్ఞ!" అన్నాడు మత్రాసింగు.

"అయిన వారితో చెప్పి రావటాని కైనా అవకాశం లేదా?"

"దానుణ్ణి క్షమించాలి."

"మహారాజుగారి ఆజ్ఞకు తిరుగు లేదనుకో... అయినా, ఒకవేళ నేను నీకు బందీ కావటానికి నిరాకరించి యుద్ధానికి తలబడితే ఏం చెయ్యమన్నారు మహారాజుగారు?"

"నా నోట అనరాని మాట అనిపిస్తున్నారు... యువరాజును సజీవంగా గాని, నిర్జీవంగా గాని తెచ్చి తమ ఎదట ఉంచమని మహారాజుగారి ఆజ్ఞ!"

తన తండ్రి వైఖరి తాను భయపడినంత తీవ్రంగానూ ఉన్నదని జగతసింహుడు గ్రహించాడు. తాత్సారం చేసి ప్రయోజనం లేదు, తండ్రి ఎదటికి పోయి దండన పొందటం తప్ప వేరు మార్గం లేదు.

అతను మత్రాసింగుతో, "నా సైన్యం దారుకేశ్వర నదీ తీరాన జహనాబాదు దగ్గిర ఉన్నది. దాని గతేమిటి?" అన్నాడు.

"దాని విషయమై నేను ఏర్పాటు చేస్తాను," అని మత్రాసింగు ఒక సైనికుణ్ణి జహనాబాదుకు వెళ్ళమన్నాడు. ఆ సైనికుడు మందారణ మీదుగానే వెళ్ళాలి.

జగతసింహుడు ఆ సైనికుడితో, "నీకు మందారణ దుర్గ ప్రాంతంలో ఎవరైనా కనిపిస్తే, నేను మా తండ్రిగారి ఆజ్ఞపై ఆయనను చూడటానికి పాట్నా వెళ్ళానని చెప్పు," అన్నాడు.

తరవాత అతను తన తండ్రి పంపిన అశ్వికుల వెంట బయలుదేరాడు. అతని కోరిక ప్రకారం మత్రాసింగు తన సైనికులను రెండు భాగాలు చేశాడు. వెనకా, ముందూ సైనికులు నడుస్తుంటే, మధ్యగా జగతసింహుడు నడిచాడు, అతని పక్కగా మత్రాసింగు నడిచాడు. —(ఇంకావుంది)






# విష్ణుమాయ

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, ఈ నిశిరాత్రి నీవు పడుతున్న శ్రమ అంతా భ్రమ కావచ్చు ననీ, అకస్మాత్తుగా ఈ భ్రమ తొలిగిపోయి నీవు నీ ఇంటనే ఉండవచ్చు ననీ నీకు సందేహం కలిగిందా? అలాటి అనుభవం పొందినవాడు పుష్కరు డొక డుండేవాడు. శ్రమ తెలియకుండా అతని కథ విను," అంటూ ఇలా చెప్ప సాగాడు:

వింధ్యాటవీ ప్రాంతంలో పుష్కర మనే చిన్న రాజ్యం ఉండేది. దానికి పుష్కరు డనే రాజుండేవాడు. అతను యువకుడు. కొత్తగా రాజ్యానికి వచ్చాడు. ఆ సమయం లోనే అతని తల్లిదండ్రు లిద్దరూ పోయారు. పుష్కరుడు వారికి ఎంతో భక్తిశ్రద్ధలతో దినవారాలు జరిపి, తన కాల మంతా విష్ణు

## బేతాళ కథలు



చింతన లోనే గడుపుతూ వచ్చాడు. అతను పసితనం నుంచీ విష్ణు భక్తుడు. తల్లి దండ్రులు పోయాక అతనికి విష్ణుమూర్తి తప్ప మరెవరూ ఆప్తులు లేరనిపించింది. "విష్ణుమూర్తిని నే నింతగా నమ్ముకుని ఉన్నాను గదా, ఆయన నా పట్ల అనుగ్రహం ఎందుకు చూపడు? కనీసం తన మహిమ అయినా ఎందుకు ప్రదర్శించడు?" అని అస్తమానమూ దిగులుపడేవాడు.

చూస్తుండగానే ఏడాది తిరిగిపోయింది. పుష్కరుడి తండ్రి తద్దినం వచ్చింది. దానికి అవసరమైన ఏర్పాట్లన్నీ చెయ్యమని తన మనుషులను పురమాయించి, పుష్కరుడు పెందలాడే స్నానంచేసి వద్దామని నదికి వెళ్ళాడు. అతను విష్ణు ధ్యానం చేస్తూ నీటిలో మునగగానే అక్కడి కొక అప్సరస లాటి మాదిగ మనిషి వచ్చింది. ఆ మనిషిని చూడగానే పుష్కరుడి మనస్సంతా చంచల మైపోయింది. అలాటి దాన్ని భార్యగా చేసుకోని జన్మ వృథా అనిపించింది. దేవు డా ఆడమనిషిని తన కోసమే సృష్టించా డనుకొని అతను ఆమె వెంట బయలుదేరాడు.

అది చూసి ఆ స్త్రీ, "అయ్యా, మీరు రాజులు, నేను అంటరాని దాన్ని. నాకు పెళ్ళి కూడా కా లే దు. మీరు నా వెంట రావటం చూసి మా వాళ్ళు నన్ను చంపేస్తారు. ఇలా చెయ్యటం మీకు ధర్మం కాదు," అన్నది.

అయినా పుష్కరుడు దాని వెనకే నడుచు కుంటూ మాదిగగూడెంకు వెళ్ళి, అక్కడి వాళ్ళతో, "ఈ అమ్మాయిని నా కిచ్చి పెళ్ళి చెయ్యండి. నే నీమెను మోహించాను," అన్నాడు.

మాదిగవాళ్ళు, "మా కేమీ అభ్యంతరం లేదు. కాని రాజువైన నీవు ఇలాటి పెళ్ళి చేసుకుంటే మీ ప్రజ లేమంటారు?" అని చెప్పి చూశారు. పుష్కరుడు వినక,



ఆ మాదిగ దాన్నే పెళ్ళాడతానని పట్టు బట్టాడు. అతని కా మాదిగ దాన్ని ఇచ్చి పెళ్ళి చేశారు. అతను సమస్తమూ విడిచి పెట్టి, ఆ గూడెం లోనే కాపరం పెట్టాడు. అతనికి ఆ భార్య వల్ల ఇద్దరు మగపిల్లలూ, ఒక ఆడపిల్లా కలిగారు.

మాదిగదాని అన్నలు తమ చెల్లెలి సంసారాన్ని పోషించలేక, వాళ్ళను వేరే కాపరం పెట్టమన్నారు. పుష్కరుడికి సంసార భారం జాస్తి అయింది. అతను భార్య కుట్టే చెప్పులు తీసుకుపోయి అమ్ము కొచ్చేవాడు, అడవికి వెళ్ళి కట్టే, కంపా కొట్టి మోపు కట్టి దగ్గిరలో ఉండే పట్టణానికి తీసుకుపోయి అమ్ముకుని వస్తూండేవాడు.

ఇలా ఒకసారి అతను కట్టెపుల్లలు మోపు గట్టి పట్టణానికి చేరే సరికి అక్కడ ఒక సంగతి వింతగా చెప్పుకుంటున్నారు. ఆ నగరపు రాజుకూతురు రోజూ నలుగు పెట్టుకున్న పిండిని దొడ్లో ఒక మూల వేసే వాళ్ళు. అక్కడ ఒక చెట్టు మొలిచింది. అదేం చెట్టో ఎవరూ చెప్పలేకపోయారు. ఆ చెట్టు పేరు చెప్పినవాడికి తన కూతురి నిచ్చి పెళ్ళి చేస్తానని రాజు కొత్తగా ప్రకటన చేశాడు. దాన్ని గురించే ప్రజలు వింతగా చెప్పుకుంటున్నారు.



పుష్కరుడు గుంపుల వెంట రాజ ప్రాసాదం లోకి వెళ్ళి, ఒక మూల పెరుగు తున్న మొక్కను చూస్తూనే, "ఇది గంధపు మొక్క. ఆ మాత్రం తెలియదా ?" అన్నాడు. దాసీలు వెళ్ళి రాజుతో అతనన్న మాట చెప్పారు. రాజు అతన్ని పిలిపించి, తన కుమార్తె నిచ్చి పెళ్ళిచేసేశాడు.

పుల్లల కోసం అడవికి వెళ్ళిన తన భర్త ఎందుకు తిరిగి రాలేదో మాదిగదానికి అర్థం కాలేదు. అతనికి రాజుగారు తన కూతురు నిచ్చి పెళ్ళి చేశారనీ, తన భర్త ఇప్పుడు రాజభవనంలో సమస్త సుఖాలూ అనుభ విస్తున్నాడనీ కొంత కాలానికి తెలియ





వచ్చింది. వెంటనే మాదిగది తన బిడ్డలను పిలిచి, "మీ అయ్య ఫలాని చోట ఉన్నాడు. అక్కడికి వెళ్ళి, తిండికి జరగటం లేదని చెప్పి, ఆయన ఇచ్చినది పుచ్చుకురండి," అని పంపింది.

పుష్కరుడు తన కొత్త భార్యతో కాపరం ఉంటున్న మేడ కిందికి వచ్చి వాళ్ళు, "అయ్యా, ఆకలి! బాబూ, ఆకలి!" అని ఆర్తిగా అరవసాగారు. పుష్కరుడు మేడ కిటికీలో నుంచి తొంగిచూసి, తన బిడ్డలను గుర్తించి, చల్లగా తన వేలి ఉంగరం తీసి వాళ్ళ ముందు పడేశాడు. వాళ్ళు దాన్ని తీసుకుని తమ తల్లి దగ్గిరికి వెళ్ళిపోయారు.

అద్దం ముందు కూర్చుని తల దువ్వుకుంటున్న అతని కొత్తభార్య పుష్కరుడు చేసిన పని గమనించింది; కాని పైకేమీ అనలేదు.

మాదిగది తన భర్త పంపిన ఉంగరాన్ని అమ్మి, ఆ వచ్చిన డబ్బుతో తన సంసారాన్ని సుఖంగా జరిపింది. డబ్బు అయిపోగానే ఆమె తన పిల్లలను మళ్ళీ వాళ్ళ తండ్రి దగ్గిరికి పంపింది. వాళ్ళు ముగ్గురూ మరొకసారి తమ తండ్రి మేడ వద్దకు వచ్చి, "అయ్యా, ఆకలి!" అని అరిచారు.

ఈ సారి పుష్కరుడు కిటికీలో నుంచి రెండు బంగారు రేకులు పడేశాడు. పిల్లలు వాటిని తీసుకుని తల్లి వద్దకు తిరిగి వెళ్ళారు.

రాజకుమార్తె ఈ సారి కూడా తన భర్త చేసిన పని గమనించింది. "కుక్క ముట్టుకున్న కుండను ఏంచెయ్యాలి?" అని ఒక చీటీ మీద రాసి, ఒక దాసిద్వారా రాజసభలో ఉన్న తన తండ్రి వద్దకు పంపింది.

రాజది చదువుకుని, "కుక్క ముట్టుకున్న కుండను అవతల పారెయ్యవలిసింది," అని, ఆ చీటీకి జవాబు రాసి తన మంత్రికి చూపాడు.

"అవతల పారెయ్య నవసరం లేదు, మహారాజా. అగ్నితో శుద్ధి చేసి తిరిగి వాడుకోవచ్చు," అన్నాడు మంత్రి.

అప్పుడు రాజు, "కుక్క ముట్టిన కుండను నిప్పుకు చూపించి వాడుకో వచ్చు," అని జవాబు రాసి తన కూతురికి పంపాడు.

ఆ రాత్రి పుష్కరుడు నిద్రపోతూండగా రాజకుమార్తె అతను పడుకున్న గదికి నిప్పు పెట్టింది. నిద్రపోతున్న పుష్కరుడి పైన కాలే వస్తువులు పడి చుర్రుమన్నది.

ఆ బాధకు అతను చప్పున నీటిలో నుంచి పైకి లేచాడు. తన తండ్రి ఆబ్దికం జ్ఞాపకం వచ్చి, తాను చాలా సేపు తాత్సారం చేశానని భయపడి గబగబా నడుస్తూ ఇంటికి వెళ్ళాడు.

"ఇంతలోనే తిరిగి వచ్చారే! అప్పుడే స్నానం అయిపోయిందా?" అన్నారు బ్రాహ్మణులు.

స్నానం చేద్దామని నీటిలో మునిగి మళ్ళీ పైకి లేచే లోపుగా తనకు జరిగిన అనుభవాలన్నిటినీ అతను బ్రాహ్మణులకు చెప్పాడు.

వారు అంతా విని, "నిశ్చయంగా ఇది విష్ణుమాయ!" అన్నారు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, నాకొక్క సందేహం. విష్ణువు తన మాయను ఇలా ప్రదర్శించటంలో ఆయన ఉద్దేశమేమిటి? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగులుతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "పుష్కరుడు రాజుగా తన బాధ్యతలను విస్మరించి ఎప్పుడూ విష్ణుచింతనలోనే కాలం పుచ్చాడు. అందుచేత మనిషికి కలిగే సహజ వికారాలనూ, నిరుపేదలు గడిపే నికృష్టజీవితాన్నీ, పుష్కరుడికి గుర్తు చేసే ఉద్దేశంతో విష్ణువు తన మాయను అలా ప్రదర్శించాడు," అన్నాడు.

రాజుకీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# తారావలోకుడు

పూర్వం శిబిదేశాన్ని చంద్రావలోకు డనే రాజు పాలించేవాడు. ఆయన భార్య చంద్ర లేఖ. ఆయన వద్ద కువలయాపీడ మనే ప్రఖ్యాతి గల ఏనుగు ఒకటి ఉండేది. ఆ ఏనుగు కారణంగా శత్రురాజులు చంద్రావలోకుడి రాజ్యాన్ని కన్నెత్తి చూడ లేకపోయేవారు.

చంద్రావలోకుడికి తారావలోకు డని ఒక కొడుకు కలిగాడు. అతను సౌమ్యుడు, ధర్మ పరుడు, జ్ఞాని, పితృసేవా పరాయణుడు. అన్నిటినీ మించి అతను మహాదాత.

తారావలోకుడికి యుక్తవయసు రాగానే అతని తండ్రి అతనికి మద్రరాజు కూతురును, మాద్రి అనే దాన్ని తెచ్చి పెళ్ళిచేసి, యువరాజుగా అతన్ని అభిషేకించాడు. యువరాజైనది మొదలు తారావలోకుడు దానసత్రాలు ఏర్పాటు చేశాడు. నిద్ర లేస్తూనే అతను కువలయాపీడాన్ని ఎక్కి దానపాత్రులైన వారి కోసం వెతుకుతూ తిరిగే వాడు. దాతగా అతని కీర్తి దశదిశలా వ్యాపించింది.

కొంత కాలానికి మాద్రి కవలపిల్లలను కన్నది. వాళ్ళకు రామలక్ష్మణు లని పేరు పెట్టుకున్నారు. వాళ్ళంటే తాతకూ, అవ్వకూ తండ్రికీ, తల్లికీ ఎంతో ముద్దు. తారావలోకుడి కన్న కీర్తిమంతుడూ, అదృష్ట వంతుడూ ప్రపంచంలో ఉండడని చూసే వారికి అనిపించింది.

ఇది చూసి అతని శత్రువులు ఓర్చలేక పోయారు. వారు కొంత మంది బ్రాహ్మణులను పిలిచి, "మీరు తారావలోకుడి వద్దకు వెళ్ళి కువలయాపీడ మనే ఏనుగును దానంగా యాచించండి. ఆ ఏనుగును అతను మీకు దానం ఇచ్చినట్టయితే అతని బలం తరిగిపోతుంది; ఆ పైన అతని రాజ్యాన్ని మేము సులువుగా కాజేస్తాం.



అత నా ఏనుగును మీకు దానంగా ఇవ్వని పక్షంలో అతని కున్న మహాదాత అనే కీర్తి కాస్తా మాసిపోతుంది," అన్నారు.

బ్రాహ్మణులు ఈ కుతంత్రానికి సమ్మతించి, తారావలోకుడి వద్దకు వెళ్ళి, తమకు కువలయాపీడాన్ని దానంగా ఇవ్వ వలసిందని అతన్ని కోరారు. ఆ బ్రాహ్మణులకు ఏనుగుతో ఏ విధమైన ప్రయోజనమూ ఉండదనీ, ఎవరో దుర్మార్గులు వీరి నిలా కోరమని పురికొల్పి పంపారనీ తారావలోకుడు గ్రహించాడు. కాని తన బొందిలో ప్రాణం ఉండగా యాచకుడికి లేదని చెప్పటం అతనికి సమ్మతం కాదు, అందుచేత అతను ఆ బ్రాహ్మణులకు కువలయాపీడాన్ని ఇచ్చేశాడు.

బ్రాహ్మణులు ఏనుగును పట్టుకు పోతూండగా పౌరులు చూసి మండి పడ్డారు. ఆ రాజ్యానికి రాజొకడు ఉన్నప్పటికీ పరిపాలన పౌరస్వామికం; రాజు ప్రజల ఇష్టాన్ననుసరించే పాలించాలి. అందుచేత పౌరులు చంద్రావలోకుడి వద్దకు వెళ్ళి, "రాజా, నీ కుమారుడు రాజ్యం చెయ్యాలని కోరుతున్నట్టు కనబడదు. శత్రువులకు పక్కలో బల్లెంగా ఉన్న కువలయాపీడాన్ని ఎవరికో దానం చేసేశాడు. ఆ ఏనుగును



తిరిగితెప్పించు. లేదా నీ కొడుకును అడవికి వెళ్ళి తపస్సు చేసుకోమను. ఏదీ కాకపోతే మేము మరొక రాజును ఏర్పాటు చేసుకుంటాం," అని చెప్పారు.

ప్రజలు అంటున్న మాటలను చంద్రావలోకుడు తన కొడుకుకు తెలియబరిచాడు.

"ఏనుగును నేను దానం చేసేశాను. అది ఇక రాదు. ఎవరు ఏది అడిగినా నేను ఇచ్చి తీరుతాను. పౌరుల అధీనంలో ఉండే ఈ రాజ్యం నా కెందుకు? ఇతరుల కివ్వటానికి నాకు అధికారం లేని సిరిసంపదలు మాత్రం దేనికి? నేను అడవికి వెళ్ళి ఉంటాను," అన్నాడు తారావలోకుడు.





అతను నారబట్ట కట్టి, తన భార్యనూ, కొడుకులనూ వెంటబెట్టుకుని, ఆ పసి వాళ్ళ కోసం ఒక గుర్రాల బండిని మాత్రం తీసుకుని వనాలకు బయలుదేరాడు. దారిలో మళ్ళీ కొందరు బ్రాహ్మణులు దాపరించి, బండికి కట్టిన గుర్రా లివ్వమని తారావలోకుణ్ణి యాచించారు. అతను కాదనక, బండి నుంచి గుర్రాలను విప్పి వారి కిచ్చేసి, తన భార్యతో సహా తాను బండిని ఈడుస్తూ ముందుకు సాగాడు.

పిల్లలను బండిలో ఉంచి బండిని లాగుతూ అడవి దారిన వెళ్ళే ఆ దంపతులు అలిసిపోయి, సేద దీర్చుకోవటానికి ఒక చోట ఆగే సరికి, ఇంకొక బ్రాహ్మణుడు వచ్చి, తనకు ఆ బండి నివ్వమని యాచించాడు. తారావలోకుడు నిర్వికారంగా ఆ బండిని ఆ బ్రాహ్మణుడి కిచ్చేసి, తన భార్యనూ, కొడుకులనూ వెంటబెట్టుకుని తపోవనానికి చేరుకున్నాడు. అక్కడ వాళ్ళు చెట్ల నీడే ఇల్లుగా నివసించ సాగారు.

ఒకనాడు మాద్రి తన భర్త కోసం పళ్లూ, పూలూ తీసుకురావటానికి బయటికి వెళ్ళిన సమయంలో, వారి పర్ణశాల కొక ముసలి బ్రాహ్మణుడు వచ్చి, తారావలోకుణ్ణీ, రామ లక్ష్మణులనూ చూసి, ఆ పిల్ల లిద్దరినీ తన కివ్వమని యాచించాడు.

"విధి నా ధైర్యాన్ని నీరుగార్చటానికి చూస్తున్నది. పిల్లలను దానం చేసిన బాధకైనా తట్టుకోగలను కాని, అడిగిన వాడికి లేదన్న బాధకు తట్టుకోవటం నాకు సాధ్యం కాదు," అనుకుని తారావలోకుడు ఆ ముసలి బ్రాహ్మణుడికి తన కొడుకు లిద్దరినీ ఇచ్చి, తీసుకుపొమ్మన్నాడు.

రామలక్ష్మణు లా బ్రాహ్మణుడి వెంట వెళ్ళటానికి ఒప్పుకోక మోరాయించారు. ఆ బ్రాహ్మణుడు ఆ పసివాళ్ళ చేతులను అడవి తీగలతో కట్టి, కొట్టుతూ తోలుకుపో సాగాడు. పాపం వాళ్ళు "అమ్మా" అని

ఆక్రోశిస్తూ, కళ్ళ వెంట కన్నీరు కార్చుతూ, వెనక్కు తిరిగి తండ్రిని చూస్తూ ఆ బ్రాహ్మ ణుడి వెంట వెళ్ళిపోయారు.

కొంత సేపటికి మాద్రి పూలూ, కాయలూ, దుంపలూ తీసుకుని కుటీరానికి వచ్చింది. తన భర్త తల వంచుకుని కూర్చుని ఉండటం ఆమె చూసింది, కాని పిల్లలు కనిపించ లేదు. వాళ్ళు ఆడుకునే మట్టి గుర్రాలూ, మట్టి రథాలూ మొదలైన బొమ్మలు చిందరవందరగా పడివున్నాయి. ఆమెకు గుండె గుబుక్కు మన్నది; "అయ్యో, పిల్ల లేరీ?" అన్న దామె.

"నీ కొడుకులను ఒక దరిద్ర బ్రాహ్మణ యాచకుడి కిచ్చేశాను," అని తారావలోకుడు చిన్న గొంతుతో అన్నాడు.

వెంటనే ఆమెకు ఎక్కడలేని ధైర్యమూ వచ్చినట్టయింది. ఆమె ఎంతో శాంతంగా, "మంచి పని చేశారు. యాచకుణ్ణి వట్టి చేతులతో ఎలా పంపటం?" అన్నది.

ఆమె అన్న మాటలకు ఇంద్రుడి సింహా సనం ఊగిపోయింది. మాద్రీ తారావలోకుల దాన శక్తికి తన లోకం చలించినట్టు గ్రహించి, ఇంద్రుడు బ్రాహ్మణ రూపం ధరించి తారావలోకుడి ఆశ్రమానికి వచ్చి, అతని భార్య అయిన మాద్రిని తన కివ్వ



మని యాచించాడు. తన భార్యను దానం చెయ్యటానికి తారావలోకుడు నీరు తెచ్చాడు.

"అయ్యా, నీకు ఈ భార్య ఒక్కతే గదా మిగిలినది? ఈమెను కూడా ఇచ్చేసి, ఆ తరవాత ఏం సాధిస్తావు?" అని ఇంద్రుడు తారావలోకుణ్ణి అడిగాడు.

"నే నేమీ సాధించ గోరను. నా కున్న కోరిక ఒక్కటేః బ్రాహ్మణులకు లేదనను; నా ప్రాణమైనా ఇచ్చేస్తాను," అన్నాడు తారావలోకుడు.

ఇంద్రుడు తన అసలు రూపంతో ప్రత్యక్షమై, "నాయనా నీ భార్య నా కవ సరం లేదు. నీవు త్వరలోనే విద్యాధరులకు

చక్రవర్తివి కాబోతున్నావు," అని చెప్పి అంతర్థానమయాడు.

ఈ లోపల రామలక్ష్మణులను యాచించి పట్టుకు పోయిన ముసలి బ్రాహ్మణుడు, దైవికంగా చంద్రావలోకు డుండే పురానికే వెళ్ళి, అక్కడి వీధిలో వాళ్ళను అమ్మటానికి ప్రయత్నించాడు. పౌరు లా కుర్రవాళ్ళను గుర్తుపట్టి, వాళ్ళతో బాటు ఆ ముసలి బ్రాహ్మణుణ్ణి కూడా పట్టుకుని రాజు దగ్గిరికి తీసుకుపోయారు. చంద్రావలోకుడు జరిగినదంతా ఆ బ్రాహ్మణుడి ద్వారా తెలుసుకుని, తన కొడుకు దాతృత్వం తలచుకుని, రాజ్యం మీద విరక్తి చెంది, వనానికి పోయి తపస్సు చేసుకుందా మనుకున్నాడు.

పౌరులు ఎంత బతిమాలినా వినకుండా ఆయన తన మనమలను ఆ బ్రాహ్మణుడి వద్ద డబ్బిచ్చి కొనుక్కుని, వాళ్ళనూ, తన భార్య అయిన చంద్రలేఖనూ వెంటబెట్టుకుని, తన కొడుకు ఉండే ఆశ్రమానికి వెళ్ళిపోయాడు. తారావలోకుడు తండ్రిని అంత దూరంలోనే చూసి, పరిగెత్తుకుంటూ వచ్చి ఆయన కాళ్ళ మీద పడ్డాడు.

ఆశ్రమంలో అందరూ తిరిగి కలుసుకుని ఒకరి సంగతు లొకరికి చెప్పుకుంటూ ఉన్న సమయంలో ఆకాశం నుంచి లక్ష్మీదేవి ఒక ఏనుగుతో సహా అక్కడికి దిగింది. ఆమె తారావలోకుడితో, "ఈ ఏనుగు నెక్కి విద్యాధర లోకానికి వెళ్ళు. దానమహిమ చేత విద్యాధర చక్రవర్తి పదవి సంపాదించుకున్నావు," అని చెప్పింది.

తారావలోకుడు భార్యా పుత్ర సమేతుడై తన తల్లిదండ్రుల పాదాలకు వందనం చేసి, ఆ ఏనుగు మీద ఎక్కాడు. ఆశ్రమవాసు లందరూ దిగ్భ్రమచెంది చూస్తూండగా ఆ ఏనుగు తారావలోకుణ్ణీ, మాద్రినీ, రామ లక్ష్మణులనూ, లక్ష్మీదేవినీ ఎక్కించుకుని, విద్యాధర రాజులు వెంటరాగా, ఆకాశ మార్గాన వెళ్ళిపోయింది.





# రాజ్యలోభి

వ్యాఘ్రపాదుడూ, సత్యశేఖరుడూ అనే ఇద్దరు రాజకుమారులు ఒకే గురువు వద్ద చదువు కుంటూ, ఎంతో అన్యోన్యంగా ఉండే వాళ్ళు. వాళ్ళు ఒకనాడు ఒప్పందం చేసు కున్నారు. "ఈ చదువు పూర్తి అయాక ఎవరి దేశానికి వాళ్ళం వెళ్ళిపోయి, ఎవరి రాజ్యాన్ని వారు ఏలుకుంటూ ఉంటే మన ఈ స్నేహం పదికాలాల పాటు నిలిచి ఉండదు. అందుచేత మనలో ఎవరికి ముందు కొడుకు పుట్టినా వాడే రెండు రాజ్యాలూ ఏలేటట్టు ఏర్పాటు చేసు కుందాం," అని వాళ్ళు అనుకున్నారు.

ఇద్దరి చదువూ పూర్తి అయింది. ఇద్దరూ పెళ్ళిళ్ళు చేసుకున్నారు. కొంత కాలానికి వ్యాఘ్రపాదుడి భార్య గర్భవతి అయింది. వ్యాఘ్రపాదుడు, తన భార్య కేం బిడ్డ పుట్టు తుందని ఎందరో జ్యోతిష్కుల నడిగాడు. ఆడపిల్ల పుట్టుతుందన్న వాళ్ళ నాయన చురచురా చూడటం వలన జ్యోతిష్కు లందరూ భయపడి మగ పిల్లవాడే కలుగుతా డని చెప్పారు.

వ్యాఘ్రపాదుడి భార్యకు కొడుకు పుట్టబో తున్నా డన్నది రూఢివార్త కిందనే రాజ్యంలో ప్రచార మయింది.

కాని వ్యాఘ్రపాదుడి భార్య ఆడపిల్లను కన్నది. ఈ వార్త విని అతను హతాశుడై, లోకాన్ని వంచించటానికే తీర్మానించుకుని, మంత్రసానులనూ, అంతఃపుర దాసీలనూ భయపెట్టి, తనకు మగపిల్లవాడే పుట్టినట్టు అందరికీ చెప్పించాడు. ఆ పిల్లకు విజయు డని నామకరణం చేయించి, బారసాలకు తన మిత్రుడైన సత్యశేఖరుణ్ణి పిలిచాడు. సత్యశేఖరుడు వచ్చి, తన మిత్రుడికి కొడుకు కలిగినందుకు ఎంతో సంతోషించి, తన రాజ్యాన్ని ఆ శిశువుకు ధారాదత్తం చేసి వెళ్ళిపోయాడు. వ్యాఘ్రపాదుడి

బి. నాగేశ్వరరావు

మాయోపాయం అతని మిత్రుడి పైన బాగాపారింది.

ఇదే సమయంలో, విదిశానగర రాజైన మృగాంకదత్తుడికి పురుషరాశిలో, పురుష గ్రహ వీక్షణంలో, పురుషలగ్నంలో, పురుషాంశన ఒక ఆడపిల్ల పుట్టింది. ఆమెకు ధీరలలిత అని పేరు పెట్టుకున్నారు. మృగాంకదత్తుడికి మరి వేరే సంతానం లేదు. ధీరలలితను తన కోడలు చేసుకుంటే విదిశారాజ్యం కూడా తనకే వస్తుందన్న దురాశకొద్దీ వ్యాఘ్రపాదుడు తన 'కొడుక్కు' ధీరలలితను చేసుకుంటానన్నాడు. మృగాంకదత్తుడు సమ్మతించి, ధీరలలిత చిన్నపిల్లగా ఉండగానే ఆమెను విజయుడికిచ్చి పెళ్ళి చేశాడు.

ధీరలలిత పెరిగి పెద్ద దవుతున్నకొద్దీ ఆమెలో స్త్రీ లక్షణాలు పెంపొందటానికి బదులుగా పురుష లక్షణాలు ప్రకోపించసాగాయి. తాను ఒకడి భార్య నన్న మాట తలుచుకుంటేనే ఆమెకు పరమ అసహ్యంగా ఉండేది. ఆమెకు నగలన్నా రోతగానే వుండేది. ఎవరే మనుకుంటారో అన్న బిడియం లేకుండా అస్తమానం మగవాళ్ళతో తిరగసాగింది. ఇలా ఉండటం వల్ల పరువు పోతుందని చెలికత్తెలు చెబితే వాళ్ళ మాటలు విని అసహ్య పడేది.



వ్యాఘ్రదత్తుడు తన కూతురును కొడుకని ప్రకటించి ఉన్నవాడు కావటం చేత, తన మోసం సాధ్యమైనంత కాలం రహస్యంగా ఉంచగోరి కోడలిని కాపరానికి పంపమని అడగలేదు. లేక లేక కలిగిన ఏక సంతానం కావటం చేత వా రడిగినప్పుడే పంపుదాం లెమ్మని మృగాంకదత్తుడు, ఆ ప్రస్తావన ఎత్తకుండా వూరుకున్నాడు.

కాని తన కుమార్తెలో క్రమంగా స్త్రీత్వ లక్షణాలు అంతరించుతూ ఉండటమూ, ఆమెకు అత్తవారి పేరు చెబితేనే జుగుప్స కలుగుతూ ఉండటమూ మొదలైన విషయాలు విని, మృగాంకదత్తుడు తానే తన కుమార్తెను అత్తవా రింటికి పంపటం పరువుగా వుంటుందేమో నన్న నిశ్చయానికి పచ్చి, ఈ సంగతి కుమార్తె వద్ద ఎత్తాడు.

"నా కొక మొగు డేమిటి? నేను కాపరానికి వెళ్ళట మేమిటి? ఛీ, ఛీ!" అన్నది ధీరలలిత.

ఆ మాటలకు తండ్రి మండిపడి, "నా పరువు గంగలో కలుపుతావా?" అని కూతుర్ని గదమాయించాడు.

"నాకు పరువు మాట తెలీదు. నేను చావనన్నా చస్తాను గాని, నా మొగుడి దగ్గిరికి కాపరానికి వెళ్ళను. ఇది నిశ్చయం," అన్నది ధీరలలిత,





"నీ వంటి కూతురున్న అపఖ్యాతి భరించలేను. నిన్ను చంపటమే మంచిది," అన్నాడు మృగాంకదత్తుడు.

"ఏ నేరమూ చెయ్యని మనిషిని చంపితే నీకు అపఖ్యాతి రానే వస్తుంది. నేను నిన్ను ముందు బాణంతో కొడతాను. ఆ ద్రోహానికి శిక్షగా నన్ను వధించు. అప్పుడు నీకు పాపం అంటదు, నీ కోరికా నెరవేరుతుంది," అంటూ ధీరలలిత అవతలికి వెళ్ళి, ధనుర్బాణాలు తెచ్చి, ఒక బాణం ఎక్కు పెట్టి, కొద్దిగానే లాగి తండ్రి పైన విడిచింది. ఆ కాస్త దెబ్బకే మృగాంకదత్తుడు దుర్భరమైన బాధ చెంది, తన కుమార్తె బలానికి ఆశ్చర్యపడుతూ, ఆమె మీదికి బలంగా కత్తి విసిరాడు.

ఆ వేటుకు ధీరలలిత చావలేదు గాని, ఆమె స్త్రీత్వం పోగొట్టుకుని పురుషుడైపోయినట్టు బయట పడింది. ధీరలలిత కాస్తా ధీరలలితుడుగా మారిపోయాడు. ఈ అపూర్వమైన మార్పు చూసి అందరూ విడ్డూరంగా చెప్పుకున్నారు. చాలా మంది సంతోషించారు. ధీరలలితుడు యువరాజు కావటమే గాక, సాటిలేని బల పరాక్రమాలూ, ధైర్య సాహసాలూ ప్రదర్శించి, తన తండ్రికి గల సేన లన్నిటికీ అధిపతి అయ్యాడు.

ఈ వార్తలన్నీ వ్యాఘ్రపాదుడికి చేరగానే అతగాడికి ఎక్కడ లేని ధైర్యమూ వచ్చి, "మీకు ఒక్కతే కూతురు గదా అని ఇంత కాలమూ మీ అమ్మాయిని మీ ఇంటనే ఉండనిచ్చాం. ఈడేరిన పిల్ల పుట్టింట దీర్ఘ కాలం ఉండటం భావ్యం కాదు. ఆమెను వెంటనే కాపరానికి పంపండి," అంటూ మృగాంకదత్తుడికి ఉత్తరం పంపాడు.

మృగాంకదత్తుడి కూతురు మగవాడుగా మారి, శూరాగ్రేసరు డనిపించుకుని, తన తండ్రికి కుడి భుజంగా ఉండి సేనా నాయకత్వం నిర్వహిస్తున్న సంగతి ఏనాడో వాడ వాడలా పాకింది. అలాటప్పుడు ఈ సమా



చారం వ్యాఘ్రపాదుడికి తెలియక పోవటం అసంభవమనీ, తనను అవమానించటానికే ఇలా ఉత్తరం రాశాడనీ గ్రహించి, మృగాంక దత్తుడు జరిగిన సంగతి వ్యాఘ్రపాదుడికి కబురు చేశాడు.

వ్యాఘ్రపాదుడు యుద్ధప్రకటన కూడా చెయ్యకుండా విదిశానగరం పైకి సైన్యంతో వచ్చి పడ్డాడు. మృగాంకదత్తుడి సేనలు ఎప్పుడూ యుద్ధానికి అయత్తంగానే ఉంటాయి. నగారా మోగగానే చతురంగ బలాలు నగరం నాలుగు పక్కలా బారులు తీరి, యుద్ధానికి సిద్ధంగా నిలబడ్డాయి.

ధూర్తుడైన వ్యాఘ్రపాదుడు మృగాంక దత్తుడికి ఇలా దౌత్యం పంపాడు: "నీకు నీతి, అభిమానమూ లేవా? నీ కొడుకును కూతురని అబద్ధమాడి నా కొడుక్కు పెళ్ళి చేసి నా రాజ్యం కాజెయ్యాలని చూస్తావా? ఇలా చెయ్యటానికి సిగ్గయినా లేదా? జరి గిన దానికి క్షమాపణ చెప్పుకుని నీ రాజ్యం నా కర్పిస్తివా నిన్ను ప్రాణాలతో విడుస్తాను. లేకపోతే నిన్ను భయంకర యుద్ధంలో సమూలంగా నాశనం చేస్తాను."

దీనికి జవాబుగా మృగాంకదత్తుడు ధీర లలితుణ్ణి యుద్ధానికి పంపాడు. ధీరలలి తుడు యుద్ధానికి కదలగానే నగరం లోని




ప్రతి మనిషీ తలా ఒక ఆయుధం పట్టుకుని, అతని వెంట యుద్ధానికి కదిలారు.

ఉభయ పక్షాలకూ యుద్ధం జరిగింది. ధీరలలితుడు వేసిన బాణానికి వ్యాఘ్ర పాదుడు తా నెక్కిన ఏనుగు మీద వివశుడై పడిపోయాడు. ధీరలలితు డాయన కిరీటం అవతల పారేసి, జుట్టు పట్టుకుని కింది కీడ్చి, "ఏమని దౌత్యం పంపించావు? నిన్ను నరికినా పాపం లేదు, కాని ప్రాణాలతో తీసుకు రమ్మని మా తండ్రిగారి ఆజ్ఞ అయింది. ఇప్పటికి బతికి పోయావు," అంటూ ఆయనను తన తండ్రి దగ్గిరికి తీసుకుపోయి, కాళ్ళ ముందు పడదోశాడు.



మృగాంకదత్తుడు వ్యాఘ్రపాదుణ్ణి ఉచితాసనం పైన కూర్చోబెట్టి, "రాజైన వాడికి తన బలమూ, ఎదిరి బలమూ తెలియాలి. పెద్ద మొనగాణ్ణనుకుని చాలా బీరాలు పలికావు. ఇంతకూ నీకు ప్రాణం కావాలా? కోడలు కావాలా? భయం లేదు, చెప్పు. నీకు నా అభయం ఉన్నది. దూత ద్వారా నాకు కబురు చేసినట్టుగానే, ధైర్యంగా చెప్పు," అన్నాడు.

పక్కనే ఉన్న ధీరలలితుడు, "మీరు తెమ్మంటే ఈ పశువును మీ ఎదటికి తెచ్చాను గాని, వీడి తల తెగవెయ్యటమే సరిఅయిన శిక్ష. ఇలాటి శత్రువును నిశ్శేషం చెయ్యాలి," అంటూ కత్తి ఎత్తాడు.

వెంటనే వ్యాఘ్రపాదుడు మృగాంకదత్తుడి కాళ్ళ పైన పడి, "బావగారూ, నా ద్రోహాన్ని మన్నించండి. మన వియ్యాన్ని చెడగొట్టకండి. మీ నుంచి నాకు కావలిసింది కోడలు కాదు, అల్లుడు. నాకు కొడుకు లేడు. విజయ నా కూతురు. దాన్ని కాపరానికి తెచ్చుకుని, అది నా కూతురన్న మాట మరిచిపోయి, మీ కోడలుగా ఏలుకోండి. రాజ్యలోభం చేత నేను నా ప్రాణమిత్రుణ్ణి వంచించి అతని రాజ్యం కాజేశాను. మీ రాజ్యం కూడా కాజెయ్యాలని యత్నించాను. నా పాపాలను క్షమించండి," అని వలవలా ఏడ్చాడు.

మృగాంకదత్తుడు సత్యశేఖరుడి వద్దకూ, వ్యాఘ్రపాదుడి ఇంటికీ దూతలను పంపి వారిని పిలిపించాడు. తన బాల్య మిత్రుడే తనను మోసగించినందుకు సత్యశేఖరుడు ఆశ్చర్యపడి తన రాజ్యాన్ని తాను తిరిగి తీసేసుకున్నాడు. ధీరలలితుడు వ్యాఘ్రపాదుడి కూతురైన విజయను తన భార్యగా స్వీకరించటానికి సమ్మతించాడు. భార్య భర్తగానూ, భర్త భార్యగానూ మారిపోయిన కారణం చేత వారికి శాస్త్రోక్తంగా వివాహం చేసి, అంతా సుఖంగా ఉన్నారు.





# దొంగమీదదొంగ

ఒక ఊరి రాజుకు రత్నవతి అని ఒక కూతురుండేది. ఆమె తప్ప వేరే సంతానం లేకపోవటం చేతనూ, ఆమె అసాధారణ సౌందర్యవతి కావటంచేతనూ రాజు ఆమెకు ఎక్కడెక్కడి రత్నాభరణాలూ కొని ఇచ్చేవాడు. రత్నవతి ఆ రత్నాభరణాలు ధరిస్తే వాటికే అందం వచ్చినట్టుండేది.

ఒకసారి వారి నగరానికి కొందరు రత్నవర్తకులు వచ్చారు. రత్నవతి రత్నాలను ఎంచటంలో అసాధారణ ప్రజ్ఞగలది. ఆమె ఆ వర్తకుల వద్ద ఒక వజ్రాన్ని చూసి దాన్ని ఎన్నికచేసింది. నిజానికది అతి ప్రాచీనమైన వజ్రం, యుగయుగాలుగా దాన్ని అనేక మంది చక్రవర్తులు తమ కిరీటాలలో ధరించారు. దాని కోసం యుద్ధాలూ, దండయాత్రలూ జరిగాయి. కొన్ని వందల ఏళ్ళ పాటు అది మట్టిదిబ్బలలో అజ్ఞాతంగా ఉండి మళ్ళీ దొరికింది.

రత్నవతి ఆ వజ్రాన్ని కొని, దానిని తన పాపటబొట్టులో పొదిగించి, అహోరాత్రాలు తన తలలో ధరిస్తూ వచ్చింది. వీరదాసు అనే గజదొంగకు ఆ వజ్రం గురించి తెలిసింది. వాడు దాన్ని కాజెయ్యాలని నిశ్చయించుకుని రత్నవతి ఉన్న ఊరికి వచ్చాడు. వాడు ఎంతో కాలంగా ఎన్నో సాహసకృత్యాలు చేస్తున్నాడు, ఎందరో రాజుల ఖజానాలను దోచాడు, ఎన్నో వేషాలు వేశాడు, ఎన్నో దేశాలలో దొంగతనాలు చేశాడు. కాని వాణ్ణి ఎవరూ ఏనాడూ పట్టుకోలేదు. వాడు ఫలానా అని పోల్చుకో గలిగిన వాళ్ళు కూడా లేరు.

వీరదాసు ఎంత ప్రయత్నించినా రత్నవతిని ఎత్తుకుపోకుండా ఆ వజ్రం దొరికేటట్టు కనిపించలేదు. ఎందుకంటే అది అస్తమానమూ ఆమె తలలోనే ఉండేది. చివరకొక నాడు దొంగ రత్నవతి శయనాగారం

జి. కమలనాథం

ప్రవేశించి, రత్నవతికి మైకం కలిగించి, ఆమె నెత్తుకుని, అరణ్య మధ్యంలో ఉన్న తన రహస్యగృహానికి తీసుకువెళ్ళాడు.

రాజు తన కూతురు పోయినందుకు చాలా దిగులుపడ్డాడు. రాజభటులు ఎంత ప్రయత్నించి కూడా ఆమె జాడ కనిపెట్టలేక పోయారు. అందుచేత రాజు తన కుమార్తెను తనకు తెచ్చి ఇచ్చిన వారికి ఆ పిల్ల నిచ్చి పెళ్ళిచేసి, తన రాజ్యం ఇచ్చేస్తానని అనేక దేశాలలో చాటింపు వేయించాడు.

మరొక దేశపు రాజకుమారుడు జయంతు డనే వాడికి ఈ చాటింపు వినే సరికి రత్నవతి జాడ తెలుసుకోవా లన్న ఆసక్తి కలిగింది. అతను చాలా ప్రజ్ఞలు గలవాడు, అందగాడు కూడా. అందగత్తె అయిన రాజ కుమార్తె దొరికితే పెళ్ళాడా లనే ఉద్దేశంతో ప్రచ్ఛన్నంగా అతను అనేక దేశాలు తిరి గాడు. అందగత్తె లని పేరు పొందిన రాజ కుమార్తెలలో ఒక్కరూ అతనికి నచ్చలేదు.

ఈ పరిస్థితిలో అతను చాటింపు విని, రత్నవతిని గురించి ఆరా తీశాడు. ఆమె సాటిలేని సౌందర్యవతి అని ప్రతి ఒక్కరూ అన్నారు. అయినా అతనికి ఆసక్తి కలిగించి నది పదిమందీ చెప్పుకునే ఆమె సౌందర్యం కాదు. ఆమెను ఎవరు ఎత్తుకు పోయినదీ, ఆమె ఎక్కడ ఉన్నదీ కూడా ఏ ఒక్కరికీ



తెలియక పోవటం చూసి, ఎవరూ చెయ్య లేని పని తాను సాధింతా మనుకున్నాడు. రత్నవతి నిజంగా అందగత్తె అయితే, తాను నోరు తెరిచి అడగనవసరం లేకుండా నే ఆమెను తన కిచ్చి పెళ్ళిచేస్తారు, నచ్చక పోతే పెళ్ళాడ వలిసిన నిర్బంధం ఏమీ ఉండదు. ఒక్క సంగతి మటుకు జయం తుడు ముందే రూఢి చేసుకున్నాడు: రత్న వతిని ఎత్తుకుపోయినవా డెవడో గజదొంగ అయి ఉంటాడు; ఆ దొంగ జాడ దొరికితే ఆమె జాడ తెలుస్తుంది.

ఈ లోపల రత్నవతి తానున్న రహస్య గృహంలో రాజోపచారంగా ఉంటున్నది. వీరదాసుకు ఆమెను చూసిన క్షణం నుంచీ ఒక విధమైన వాత్సల్యం ఏర్పడింది. వా డామెను ప్రాణంకన్న హెచ్చుగా చూసు కుని ఆమెను సుఖపెట్టటం కోసం ఎంతో పాటుపడ సాగాడు. ఆమె వాడి "చిట్టితల్లి". చిట్టితల్లికి ఏమాత్రమూ బాధ కలగనిచ్చే వాడు కాడు.

కొద్ది రోజులలోనే రత్నవతి కూడా తన అసలు తండ్రిని మరిచిపోయి, వీరదాసును అంతకన్న ఆపేక్షగా చూడ సాగింది. మహా రణ్యం మధ్య కూడా ఆమెకు ఏ లోటూ కనిపించలేదు. రాజభవనంకన్న అరణ్యమే చాలా అందంగా ఉన్న దనిపించింది.






త్వరలోనే వీరదాసుకు ఒక అల్లుణ్ణి కూడా సంపాదించుకోవా లన్న కోరిక బలంగా ఏర్పడింది. చిట్టితల్లికి అపురూప మైన రాజకుమారుణ్ణి సంపాదించి పెళ్ళి చెయ్యాలి. దేశాలు తిరుగుతూ వాడు ఎందరో రాజకుమారులను చూశాడు. కాని వారిలో ఒక్కడు కూడా చిట్టి తల్లి కాలి గోరుకు పోలరు. అందుచేత వీరదాసు రత్న వతికి తగిన భర్తను వెతుకుతూ దేశాల వెంట బయలుదేరాడు.

వీరదాసు ఒక దేశం వెళ్ళే సరికి అక్కడ ఆ క్రితం రాత్రి ఒక వింత దొంగతనం జరిగినట్టు తెలిసింది. అర్ధరాత్రి వేళ ఎవడో "దొంగ" అంతఃపురంలో ప్రవేశించి, ఒక పరిచారిక తల దగ్గిర రత్నాభరణాల మూట పెట్టి, పహరా వాళ్ళకు కనబడకుండా వెళ్ళి పోయాడు. ఆ ఆభరణాలు రాజుగారి ఖజా నాలో ఇనప్పెట్టెలలో ఉండేవి.

ఇది జరిగిన మరుసటి రాత్రే రాణిగారి మెడలో ఉండవలిసిన నానుపట్టెడ మంత్రి భార్య మెడలో వెలిసింది. ఈ విధంగా ప్రతి రాత్రీ ఎంతో భద్రంగా దాచిన వస్తువులు కూడా మరొక స్థానంలో ప్రత్యక్షం కాసా గాయి. ఈ పనులు చెయ్యగలవాడు "దొంగ" అనటానికి వీలు లేకపోయినప్పటికీ, వాడు తలుచుకుంటే ఎంతేసి దొంగతన మైనా చెయ్యగలడు. అందుకని ఆ దేశపు రాజు కంగారు పడిపోయి, ఆ "దొంగ" ను పట్టు కున్న వాడికి గొప్ప బహుమాన మిస్తానని ప్రకటించాడు.

వీరదాసు ఈ "దొంగ" గురించి వింటూనే వాణ్ణి తన మనస్సులో మెచ్చు కున్నాడు. బహుమానం మాట అలా ఉంచి, అంత నేర్పరిని పట్టుకుంటేనే తనకు గజ దొంగ అనే బిరుదు సార్థక మవుతుం దను కున్నాడు. దొంగను దొంగే పట్టాలి.

ఈ దొంగతనాలు చేసింది జయంతుడే. తన చర్యలను గురించి గొప్ప దొంగ ఎవ

డన్నా వింటే, తనను పట్టుకోవాలని ప్రయత్నించకుండా ఉండలేడు. తన కోసం ఎవరు కారాడుతున్నదీ తెలుసుకుంటే రత్నవతి జాడ చిక్కవచ్చు. అందుచేత తనను పట్టుకునేటందు కెవరు కారాడతారా అని అతను వెయ్యి కళ్ళతో కనిపెట్టి ఉన్నాడు. త్వరలోనే అతనికి వీరదాసు పైన అనుమానం తగిలింది. తాను "దొంగతనం" చేసిన ప్రతి చోటుకూ వీరదాసు వెళ్ళుతున్నట్టు అతను పసికట్టాడు. వీరదాసు తన అడుగు జాడల కోసం కూడా ఎంతో ఆత్రంగా చూస్తున్నాడు.

జయంతుడు వీరదాసు గురించి తెలుసుకుందామని ప్రయత్నిస్తే అతని ఊరూ, పేరూ కూడా ఏ ఒకరూ సరిగా చెప్పలేక పోయారు. అందుచేత జయంతు డతన్ని వెన్నాడ సాగాడు.

ఆ ఊళ్ళో కొద్ది రోజులుండి వీరదాసు తన చిట్టితల్లిని ఒకసారి చూసి వద్దామని బయలుదేరి నప్పుడు జయంతు డతన్ని రహస్యంగా వెంబడించి అరణ్య మధ్యానికి వెళ్ళాడు. వీరదాసు తిరిగి వెళ్ళిపోయిన దాకా వేచి యుండి, జయంతుడు అతని రహస్యగృహం ప్రవేశించి, అక్కడ రత్నవతిని చూడగానే నిర్ఘాంతపోయి నిలబడి పోయాడు. అంత అందమైన దాన్ని అత నెన్నడూ ఊహించి ఉండలేదు.





జయంతుణ్ణి చూసి రత్నవతి కూడా అత్యా శ్చర్యం చెందింది. అతను ఏ దేవలోకం నుంచో దిగివచ్చి నట్టున్నాడు.

ఇద్దరూ మాట్లాడు కోవటంలో ఆమె రత్నవతి అనీ, ఆమెను ఎత్తుకు వచ్చిన వాడు ఆమెను వాత్సల్యం కొద్దీ తన వద్ద ఉంచుకున్నాడనీ, ఆమె కూడా ఆ దొంగను తండ్రి లాగా చూసుకుంటున్న దనీ జయం తుడు తెలుసుకున్నాడు.

"నిన్ను గురించి విని, పెళ్ళాడా లన్న ఆశతో ఎంతో శ్రమపడ్డాను. మీ దేశం పోదాం, నా వెంట వచ్చెయ్యి," అన్నాడు జయంతుడు రత్నవతితో.

"అమ్మో, అలా చేస్తే వీరదాసు గుండె పగిలి చచ్చిపోతాడు. ఆయన నిన్ను చూసి మెచ్చి, సరేనంటే తప్ప మరొక విధంగా మనకు పెళ్ళి కాదు," అన్నది రత్నవతి.

"ఆయన సరే నన్న తరవాత నువు అభ్యంతరం చెప్పవుగద?" అన్నాడు జయంతుడు.

"చెప్పను," అన్నది రత్నవతి ఎంతో సిగ్గు పడుతూ.

వీరదాసు రాకకు ఎదురు చూస్తూ జయంతుడు అక్కడే ఉండిపోయాడు. రెండు రోజుల తరవాత వీరదాసు నిస్పృహతో తన ఇంటికి తిరిగి వచ్చాడు. ఎందుకంటే నగరం నుంచి "దొంగ" దాటి పోయినట్టు అతనికి తోచింది. రెండు మూడు రోజులుగా దొంగతనాలు లేవు.

వీరదాసు ఇంటికి తిరిగి వచ్చే సరికి ఇల్లు బావురుమంటున్నది. రత్నవతి జాడ లేదు. ఆమె ఏమైనదీ వీరదాసు ఊహించ లేకపోయాడు. తన రాక కోసం ఎప్పుడూ ఆత్రంగా ఎదురు చూసే మనిషి బుద్ధిపూర్వ కంగా వెళ్ళిపోదు. ఆమె నెవరో ఎత్తుకు పోయి ఉండాలి.

వీరదాసు, "చిట్టితల్లీ," అని కేకలు పెడుతూ ఇల్లంతా తిరిగాడు, చుట్టుపక్కల

అరణ్యం కూడా కొంత దూరం తిరిగాడు. అతను ఇంట్లోకి తిరిగి వచ్చే సరికి రత్నవతి పక్క మీద ఒక చీటీ పెట్టి ఉన్నది. దాని మీద ఇలా రాసి ఉన్నది: "ఒక దొంగ చేసిన పని మరొక దొంగ చెయ్య గలడు."

ఆ చీటీ కొద్ది క్షణాల క్రితం అక్కడ లేదు. తనను మించిన దొంగ ఎవడో తన ఇంట ప్రవేశించాడు! వీరదాసు గొంతు హెచ్చించి, "ఎవరు నువు? నా ఎదట పడు!" అని గట్టిగా అరిచాడు. జయంతుడు బయటి నుంచి లోపలికి వచ్చాడు. అతని వెనకనే రత్నవతి కూడా వచ్చింది.

"ఆహా, చిట్టితల్లికి తగినవాడు!" అని లోపల అనుకుని, వీరదాసు పైకి, "ఎవరు నువు?" అన్నాడు.

"నేనే, మామా! పెద్దవాడివి నన్ను పట్టటానికి శ్రమ పడుతూంటే చూడలేక నా అంతట నేనే కనబడదామని వచ్చా," అన్నాడు జయంతుడు.

తాను పట్టుకుందా మనుకున్న దొంగ ఆ కుర్రవాడే నని తెలిసి వీరదాసు పరమానందం చెందాడు. అతను చిట్టితల్లిని పెళ్ళాడటానికి వీరదాసు సంతోషంగా ఒప్పుకున్నాడు.

"మరి మా పెళ్ళికి ఉండవలిసిన బంధువు లున్నారు. నా కో రాజ్యం ఉంది. రత్నవతిని పెళ్ళాడితే ఇంకో రాజ్యం కూడా వస్తుంది. అందుచేత నువు కూడా మా వెంట వచ్చి నా తరఫున పెళ్ళి పెత్తనం చెయ్యి," అని జయంతుడు వీరదాసును ఆహ్వానించి, ఒప్పించి, తమ వెంట తీసుకుపోయాడు.

రత్నవతికీ జయంతుడికీ వైభవంగా పెళ్ళి అయింది. రత్నవతి భర్తను చూసి ఆమె అసలు తండ్రి సంతోషించాడు గాని, తన చిట్టితల్లికి అటువంటి భర్త దొరికి నందుకు నిజంగా గర్వపడిన వాడు గజ దొంగ వీరదాసు.





# అనుమానితులు

రాజుగారి గారాల కూతురు, ముత్యాల మూట, వరహాల తల్లి ఒకనాడు తన చెలికత్తెలతో ఉద్యానవన విహారం చేసి, తన నగలన్నీ తీసి క్రీడా సరోవరం గట్టున పెట్టి, వాటి కొక దాసీని కాపలా ఉంచి, జలక్రీడ ప్రారంభించింది.

ఆభరణాలకు కాపలా ఉన్న దాసీది నిద్రమత్తుతో జోగుతూ, చటుక్కున ఏదో ధ్వని విని, కంగారుగా కళ్ళు తెరిచి చూసే సరికి, రాజకుమార్తె నగలలో ఒకటైన చంద్రహారం లేదు.

దాసీది గాబరాపడి అటూ ఇటూ చూస్తే ఒక చెట్టు చాటుకు ఎవరో పరిగెత్తినట్టనిపించింది. వెంటనే అది, "దొంగ! దొంగ! చంద్రహారం!" అని కేకలు పెట్టింది. రాజకుమార్తే, చెలికత్తెలూ కూడా నీటిలో నుంచి పైకి వచ్చి, "దొంగ, దొంగ! చంద్రహారం తీసుకుని పరిగెత్తాడు!" అని కేకలు పెట్టారు. ఉద్యానవనపు నౌకర్లు దొంగను పట్టటానికి పరిగెత్తారు.

"దొంగ! పట్టుకోండి!" అన్న కేకలు విని, భయపడి, ఉద్యానవనం బయట నడిచే కాపువా డొకడు పరిగెత్త సాగాడు. రాజభటు డొకడు ఉద్యానవనం గోడ దూకి వాడి వెంట పడ్డాడు. కాని కొంతసేపయాక కాపువాడు ఇళ్ళ చాటున కనబడ కుండా తప్పించు కున్నాడు.

ఆ భటుడు రాజుగారి వద్దకు వచ్చి, చంద్రహారం దొంగిలించిన వాణ్ణి తాను కళ్ళారా చూశాననీ, ఎప్పటి కైనా వాడు కనబడితే పోల్చుకుని పట్టుకో గలననీ చెప్పాడు. రాజుగారి మనస్సు కొంత తేలిక పడింది.

భటుడు మొత్తానికి గట్టివాడు. మర్నాడే వాడు కాపు వాణ్ణి ఒక షావుకారు ఆవరణలో తోటపని చేస్తుండగా చూసి, గుర్తు పట్టి,

వి. సోమేశ్వరరావు

"దొరికావురా, దొంగా! నిన్న కాజేసిన చంద్రహారం ఏం చేశావు?" అన్నాడు.

"చంద్రహార మేమిటి? నా కేమీ తెలీదు," అన్నాడు కాపు.

"తల తీస్తేగాని నిజం చెప్పవు. నడు రాజుగారి దగ్గిరికి!" అంటూ భటుడు కాపును లాక్కుపోయి రాజుగారి ముందు పెట్టి, "వీడే వాడు!" అన్నాడు.

రాజును చూసి కాపు బెదిరిపోయి, "రక్షించండి, మహారాజా. మా షావుకారు తీసుకు రమ్మంటే ఆ చంద్రహారం తీసుకుపోయి ఆయనకే ఇచ్చాను," అన్నాడు.

రాజు షావుకారును పిలిపించాడు. కాపు, "ఈయనే మా షావుకారు. ఈయనకే చంద్రహారం ఇచ్చాను," అన్నాడు.

"చంద్రహార మేమిటి? నా కేమీ తెలీదే," అన్నాడు షావుకారు. కాని రాజుగారి కళ్ళ నిప్పులు రాలటం చూసి, పక్కకు చూసే సరికి, రాజుగారి పూజాగృహం నుంచి వెళ్ళిపోతూ పురోహితుడు కనిపించాడు.

వెంటనే షావుకారు చేతులు జోడించి, "మహారాజా, తమ పురోహితుడు చంద్రహారం కావాలంటే, ఈ కాపును పంపించి తెప్పించి, పురోహితుల వారికి అప్పుడే ఇచ్చాను," అన్నాడు.



రాజుగారు పురోహితుణ్ణి దగ్గిరికి పిలిచి, "ఈ షావుకారు మీ కిచ్చిన చంద్రహారం ఎక్కడ? నిజం చెప్పండి," అన్నాడు.

"చంద్రహార మేమిటి?" అన్నాడు పురోహితుడు బిత్తరపోయి.

"ఈ కాపువాడు రాజకుమార్తె చంద్రహారం తీసుకుని పారిపోవటం భటుడు చూశాడు. వాడు దాన్ని తీసుకుపోయి, ఈ షావుకారు కిచ్చానని ఒప్పుకుంటున్నాడు. షావుకారు దాన్ని మీ చేతి కిచ్చాడట. ఏమంటారు?" అన్నాడు రాజు.

ఏమనాలో తెలియక పురోహితుడు దిక్కులు చూసే సరికి ముసలి మాజీమంత్రి

రావటం కనిపించింది. వెంటనే పురోహితుడు, "నిజమే, మహారాజా! నిన్న రాత్రి లక్ష్మీపూజకు గాను చంద్రహారం అవసరమని షావుకారుతో అన్నాను. ఆయన దాన్ని నా కిచ్చాడు కూడా. దానితో పూజ పూర్తి చేసి, ఈ ఉదయమే మన పాత మంత్రి గారి కిచ్చాను," అన్నాడు.

అంతలో ఆ ముసలి మాజీమంత్రి అక్కడికి రానే వచ్చాడు. రాజుగా రాయనకు చంద్రహారం గొడవ అంతా చెప్పి, "పురోహితుడు మీ చేతి కిచ్చిన చంద్రహారం ఏది?" అని అడిగాడు.

మంత్రి ఒక్కసారి కాపునూ, షావుకారునూ, పురోహితుణ్ణీ చూసి జరిగినదంతా గ్రహించాడు. వాళ్ళు ఆత్మరక్షణ కోసం తప్పు ఒప్పుకుని ఇతరులను అందులో ఇరికించారు. తాను కూడా ఎవరినైనా ఇరికించి తప్పుకు పోవాలి. ఆయన బయటికి చూసే సరికి దూరాన ప్రహరీ గోడ పైన ఒక కోతి కనిపించింది. అప్పుడా వృద్ధుడు రాజుతో, "ఆ చంద్రహారాన్ని నే నిక్కడికి తెస్తూ ఉండగా ఒక కోతి దాన్ని నా చేతి నుంచి లాక్కొని పారి పోయింది," అన్నాడు.

రాజుగారు తృప్తి పడ్డారు. చుట్టుపక్కల ఉన్న కోతులన్నిటినీ అరటిపళ్ళతో ఆకర్షించి, ఏ కోతి దగ్గిర చంద్రహారం ఉన్నదీ చూడమని ఆయన తన భటులను ఆజ్ఞాపించాడు. బయలు ప్రదేశంలో అరటి పళ్లూ, కొబ్బరికాయలూ తెచ్చి పడేశారు. ఎక్కడెక్కడి కోతులూ వాటి కోసం వచ్చాయి. అందులో ఒక కోతి చంద్రహారం మెడలో వేసుకుని ఉన్నది. భటులు దాన్ని కోతి నుంచి తీసి రాజుగారి కిచ్చేశారు.

అసలా చంద్రహారాన్ని తీసినది ఆ కోతే అయి ఉండటంచేత కాపు చెప్పినదీ, షావుకారు చెప్పినదీ, పురోహితుడు చెప్పినదీ, మంత్రి చెప్పినదీ కల్పన అన్న సంగతి బయట పడనేలేదు.






# సత్యసంధుడు

ఒక నాటి రాత్రి బాగా పొద్దుపోయి ఒక అవిటివాడు పాపన్న ఇంటిని వెతుక్కుంటూ వచ్చాడు. అతను పాపన్నతో, "అయ్యా, నాకు నమ్మదగిన వారంటూ ఎవరూ లేరు. అందుచేత మీరు నాకొక్క ఉపకారం చెయ్యాలి," అని దీనంగా అన్నాడు.

"చాతనయితే తప్పక చేస్తాను. ఏం చెయ్యాలో చెప్పు," అన్నాడు పాపన్న.

ఆ వచ్చినవాడి పేరు రామన్న. వాళ్ళది సమీప గ్రామం. ఈ రామన్నకు కోదండం అనే అన్న ఒకడున్నాడు. అతను ఆ గ్రామం లోని ధనవంతులలో ఒకడు. రామన్న చిన్నతనంలోనే చెట్టు పై నుంచి పడిపోయి, ఒక చెయ్యి విరగగొట్టుకుని, అవిటివాడయాడు. అది మొదలు కోదండం తమ్ముడికి తన ఇంట నౌకరు హోదా మాత్రమే ఇచ్చి, చాలా హీనంగా చూస్తూ వచ్చాడు; "అవిటివాళ్ళకు అడుక్కు తినటం తప్ప మరోగతి లేదు," అని అప్పుడప్పుడూ తమ్ముడికి జ్ఞాపకం చేస్తూ ఉండేవాడు.

రామన్న తల్లి మటుకు తన చిన్న కొడుకు గురించి చాలా దిగులు పడేది. తాను హరీ అన్న మరుక్షణం కోదండం రామన్నను ఇంటి నుంచి వెళ్ళగొట్టుతాడని ఆమెకు తోచింది. అందుచేత ఆవిడ రామన్న కోసం ఒక వంద వరహాలు పోగుచేసి, వాటిని రహస్యంగా రామన్నకిస్తూ, "వీటిని ఎక్కడన్నా దాచి ఉంచు. కష్టకాలంలో ఈ డబ్బు అక్కరకు వస్తుంది," అన్నది.

ఆ డబ్బు ఎవరి దగ్గిర దాచటమా అన్నది రామన్నకొక పెద్ద సమస్య అయింది. అతను ఎవరినీ నమ్మలేడు. డబ్బు ఎవరి దగ్గిర దాచినా తన అన్నకు తెలిసిపోతుంది. కోదండాన్ని తృణీకరించి రామన్నను ఆదుకోగలవారెవరూ లేరు. ఈ సమస్యతో

పరోపకారి పాపన్న కథ



సతమత మవుతున్న రామన్నకు పాపన్న జ్ఞాపకం వచ్చాడు. ముక్కూ మొహమూ ఎరగని వారిని కూడా పాపన్న ఆదుకుంటా డని ప్రతీతి. పాపన్నను ఆశ్రయింతా మను కుని రామన్న రాత్రివేళ పడివచ్చాడు.

పాపన్నకు తన పరిస్థితి అంతా చెప్పి రామన్న, "అయ్యా, మీరు ఈ డబ్బు దాచి ఉంచటమే కాదు, ఈ సంగతి మా అన్నకు చెప్పకుండా ఉండాలి. మా అమ్మ నా కేదో డబ్బిచ్చినట్టు అయన పసిగట్టి నన్ను గుచ్చి గుచ్చి అడిగాడు. ఈ డబ్బు గురించి మా అన్నకు తెలిసినట్టయితే అది నాకు దక్కదు," అన్నాడు.

కోదండం గురించీ, అతని అవిటి తమ్ముణ్ణి గురించీ పాపన్న అదివరకే కొంత విని ఉండటం చేత రామన్న మాటలలో విశ్వాసం ఉంచి, "నీ డబ్బు సంగతి నా ద్వారా మీ అన్నకు తెలియదని నీవు ధైర్యంగా ఉండు. నీ అన్న వచ్చి అడిగితే నీ వెవరో కూడా నాకు తెలియదని చెప్పేస్తాను. నీకు కావలిసినప్పుడు వచ్చి డబ్బు తీసుకుంటూ ఉండవచ్చు," అని ధైర్యం చెప్పి, రామన్నను పంపేశాడు.

అయితే రామన్న భయపడిన దంతా అయింది. తన తమ్ముడు పాపన్నగారి గ్రామం వెళ్ళి, పాపన్న వద్ద కొంత డబ్బు దాచపెట్టినట్టు చూచాయగా కోదండానికి తెలియనే తెలిసింది. మర్నాడే అతను పాపన్న వద్దకు వచ్చి, "నా తమ్ముడు మీ దగ్గిర ఏదో ధనం దాచినట్టు తెలిసింది. మీ రలా చెయ్యటం ఎంతమాత్రమూ భావ్యం కాదు. ఈ సంగతి తెలిసి నలుగురూ నన్ను గురించి ఏమనుకుంటారు? నేను తమ్ముడికి ద్రోహం చేసే వాణ్ణనుకోరా? వాడి డబ్బు నా దగ్గిర ఉంటే మింగేస్తానా? దాన్ని నా కిచ్చెయ్యండి," అన్నాడు.

"మీ రేమి చెబుతున్న దీ నా కర్థం కాలేదు. మీ తమ్ముడు నా దగ్గిరికి రానూ

లేదు, నా వద్ద డబ్బు దాచనూ లేదు," అనేశాడు పాపన్న.

పాపన్న అబద్ధా లాడతాడని కోదండం కలలో కూడా అనుకోలేదు. కాని పాపన్న అన్నమాట నిజం కాదని కోదండానికి రూఢిగా తెలుసు; రామన్న పాపన్న ఇంటికి రావటం కళ్ళారా చూసినవాడే కోదండాని కా మాట చెప్పాడు.

కోదండం పాపన్నను ఏమీ చెయ్యలేక, అతను అబద్ధాలాడతా డని ఎరిగిన వాళ్ళం దరి దగ్గిరా ప్రచారం చెయ్యసాగాడు. కాని కోదండం చేసే ప్రచారాన్ని, ఆ చుట్టుపక్కల గ్రామాల్లో ఒక్కరూ నమ్మలేదు; పాపన్న ఏ చెడ్డ పనీ చెయ్యడని అందరికీ గాఢ మైన విశ్వాసం.

అయితే, తలవని తలంపుగా, పాపన్న అసత్యవాది అన్న విషయం లోకానికి వెల్లడి కావటానికి తగిన అవకాశం త్వరలోనే ఏర్పడింది. అది ఎలా జరిగిందంటే—

కోదండం వాళ్ళ గ్రామానికి దగ్గిరలో ఉండే అడవి ప్రాంతంలో, ఒక వాగులో ఒక సాధువుకు ఒక దేవతా విగ్రహం దొరికింది. ఆ సాధువు ఊళ్ళలోకి ప్రవేశించడు. అందుచేత ఆయన ఆ విగ్రహాన్ని ఒక చోట భద్రంగా ఉంచి, అడవిలో పశువులను మేపటానికి వచ్చిన కాపులతో, "నా కొక





దేవతా విగ్రహం దొరికింది. దాన్ని మీ గ్రామస్థులు తీసుకుపోయి, మంచి ప్రదేశంలో ప్రతిష్ఠ చేసి, గుడి కట్టించి, అర్చించాలి. లేకపోతే మీ గ్రామానికి అరిష్టం వస్తుంది," అని చెప్పాడు.

ఈ సంగతి గ్రామంలో తెలియగానే గ్రామ పెద్దలు గుడి కట్టించ నిర్ణయించి, అది కట్టటానికి చోటు కూడా చూసి, చందాలు వసూలు చెయ్యసాగారు. కోదండం లాటి ధనికులు ముందుకు వచ్చి ఈ పని తమ పైన వేసుకున్నారు. కోదండమే అందరి కన్న పెద్ద మొత్తం చందా వేసి, పెత్తనం వహించాడు. విగ్రహ ప్రతిష్ఠకు గాను పీఠం తయారయింది. విగ్రహాన్ని తీసుకు రావటానికి గ్రామస్థులు మేళ తాళాలతో బయలుదేరి సాధువు వుండే చోటికి చేరారు.

పూజారి స్నానం చేసి పరిశుద్ధుడై వచ్చి విగ్రహాన్ని ఎత్తబోయే సరికి అతని చేతులు చుర్రున కాలాయి. అతను బాధతో అరిచి వెనకడుగు వేశాడు.

"ఇది పవిత్రమైన విగ్రహం. సత్య వ్రతులూ, పుణ్యాత్ములూ కాని వాళ్ళు దీన్ని తాకలేరు," అన్నాడు సాధువు.

"మాలో అంత పుణ్యాత్ము లెవరున్నారు? తమరే విగ్రహాన్ని గ్రామానికి చేర్చండి," అని గ్రామస్థులు సాధువును వేడుకున్నారు.

"గ్రామ ప్రవేశం చెయ్యనని నియమం పట్టాను. మీలో ఆత్మవిశ్వాసం ఉన్నవారెవరైనా ఉంటే విగ్రహాన్ని తీసుకుపొండి," అన్నాడు సాధువు.

గ్రామస్థులు ఒకరి నొకరు మెచ్చుకుని, నీ కన్న పుణ్యాత్ము డెవడంటే నీ కన్న పుణ్యాత్ము డెవ డన్నారు, కాని తామై ఒక్కరు కూడా విగ్రహాన్ని తాకటానికి సాహసించ లేదు. చివరకు అందరి దృష్టి కోదండం మీద పడింది. వాళ్ళు ఇచ్చిన

ప్రోత్సాహంతో కోదండం ముందుకు వచ్చి, "భయంలేదు, విగ్రహాన్ని నేను ఎత్తు కుంటాను," అన్నాడు.

"నీవు పుణ్య కార్యాలు చేసిన వాడివే కదా?" అన్నాడు సాధువు.

"చెయ్యి కేమండీ? ఈ దేవతకు గుడి కట్టించటానికి నేను అందరికన్నా ఎక్కువ విరాళ మిచ్చాను. తిరునాళ్ళప్పుడు బీద లకు అన్న దానాలూ, వస్త్ర దానాలూ చేస్తూంటాను," అన్నాడు కోదండం.

"అబద్ధా లాడవు కదా?" అని అడి గాడు సాధువు.

"ఎంత మాటా! ఎన్నటికీ అబద్ధం చెప్పను," అన్నాడు కోదండం.

"అలాటి ఆత్మవిశ్వాసం ఉంటే విగ్ర హాన్ని ఎత్తుకో," అన్నాడు సాధువు.

కోదండం ముందుకు వచ్చి విగ్రహాన్ని తాకి కెవ్వున అరిచాడు. అతని చేతులు కూడా కాలాయి. పదిమంది లోనూ అతడికి మంచి పరాభవమే అయింది. అయితే అతని పరాభవం సంగతి అటుంచి, విగ్రహాన్ని ఎత్తేవా ళ్ళెవరో గ్రామస్థులకు అర్థం కాలేదు.

ఆ క్షణంలో కోదండానికి పాపన్న గుర్తు కొచ్చాడు. పాపన్న మహా పవిత్రుడని అంద రికీ నమ్మకం. అతను అబద్ధం చెప్పాడని



తాను అంటే, ఒక్కడు కూడా నమ్మలేదు. పాపన్న బండారం బయట పెట్టటాని కిది బలే అవకాశం. తనతో వచ్చి అబద్ధం ఆడిన పాపన్న వచ్చి, ఈ విగ్రహాన్ని తాకితే అతని చేతులు తప్పక కాలి తీరుతాయి. అంతటితో పాపన్న పైన జనానికి ఉండే మూఢ నమ్మకం కాస్తా తొలగిపోతుంది.

అలా అనుకుని కోదండం, "అన్నట్టు, ఈ విగ్రహాన్ని తాకటానికి సమర్థుడు మన పక్కగ్రామంలో ఉండే పాపన్నే. ఆయన మహా పుణ్యాత్ముడు, అపరహరిశ్చంద్రుడు," అన్నాడు. అందరూ ఉత్సాహం తెచ్చు కున్నారు. పాపన్న మీద అందరికీ గురే.

పాపన్నను పిలుచుకు రావటానికి ఒక సేవకుడు వెళ్ళాడు. ఆ సేవకుడు వెళ్ళి తాను వచ్చిన పని చెప్పగానే పాపన్న వాడి వెంట బయలుదేరి వచ్చాడు. అతను స్నానం చేసి, పరిశుద్ధుడై వచ్చి, సాధువుకు నమస్కారం చేసి, విగ్రహాన్ని ఎత్తుకోవటానికి అనుమతి వేడాడు.

సాధువు కోదండాన్ని అడిగినట్టు గానే, "నీవు పుణ్యకార్యాలు చేసినవాడివే గదా?" అని అడిగాడు.

"అంతరాత్మ చెయ్యమన్న పనులు చెయ్యటమే తప్ప, అవి పుణ్య కార్యాలో కావో నాకు తెలీదు, స్వామీ. అది ఆ భగవంతుడికే తెలియాలి," అన్నాడు పాపన్న.

"అబద్ధ మాడవుకదా!" అని సాధువు మళ్ళీ అడిగాడు.

"అలా చెప్పలేను. కొన్ని సందర్భాలలో అబద్ధం కూడా ఆడవలిసి వస్తుంది," అన్నాడు పాపన్న.

"సరే, నీకు ఆత్మవిశ్వాసం ఉంటే విగ్రహాన్ని ఎత్తుకో," అన్నాడు సాధువు.

పాపన్న భక్తితో విగ్రహానికి నమస్కారం చేసి, చేతులు చాచి దాన్ని ఎత్తుకున్నాడు. అతని చేతులు కాల లేదు.

గ్రామస్థులు విజయధ్వానాలు చేస్తూ, పాపన్న వెంట మేళతాళాలతో తమ గ్రామానికి వెళ్ళి, దేవతను పీఠం పైన ప్రతిష్ఠించారు. అటు పైన విగ్రహం తాకితే ఎవరి చేతులూ కాల లేదు.

అందరూ సంతోషించారు గాని ఒక్క కోదండానికే ముఖం మాడిపోయినట్టయింది. క్రమంగా అతనికి పాపన్న పైన భక్తి పుట్టుకొచ్చింది. అతను తన తప్పు తెలుసుకుని, తన తమ్ముణ్ణి సరిగా చూస్తానని తన తల్లి ఎదట ప్రమాణం చేశాడు. పాపన్న వద్ద దాచిన డబ్బును తెచ్చి రామన్న తన అన్న ఎదట పెట్టాడు. కోదండం దాన్ని తమ్ముడికే ఇచ్చేశాడు.





# ఉత్తర కాండ

శ్రీరాముడు రాక్షస సంహారం చేసి, అయోధ్యకు తిరిగి వచ్చి, రాజ్యాభిషిక్తుడై, రాజ్యపాలన చేస్తూ ఉండగా, ఒకనా డాయన ఇంటికి నాలుగు దిక్కుల నుంచీ అనేక మంది మునులు అగస్త్యుడు మొదలుగా గల వారు వచ్చి ద్వారపాలకుడి ద్వారా తాము రాముడి దర్శనానికి వచ్చినట్టు కబురు చేశారు. వెంటనే రాముడు వారిని లోపలికి రప్పించి, అర్ఘ్యపాద్యాలతో సత్కరించి, ఉచితాసనాల పైన ఆసీలను చేసి, కుశల మడిగాడు.

మునులు రాముణ్ణి మళ్ళీ రాజుగా చూడగలిగినందుకు తమ సంతోషాన్ని వెలిబుచ్చారు; రాముడు రావణుణ్ణి చంపటం ఒక లెక్కలోది కాదనీ, రాముడి చేతిలో చచ్చిన రాక్షస వీరు లందరూ గొప్పవాళ్ళే అయినప్పటికీ ఇంద్రజిత్తు వంటి అజేయుణ్ణి లక్ష్మణుడి చేత చంపించటం అత్యాశ్చర్యకరమైన విషయమనీ వా రన్నారు.

వారి మాటలు విని రాముడికి చాలా ఆశ్చర్యం కలిగింది. రావణ, కుంభకర్ణ, మహోదర, ప్రహస్త, దేవాంతక, నరాంతకుల వంటి రాక్షస వీరుల కన్న ఇంద్రజిత్తు పరాక్రమవంతు డని విని, అతను ఇంద్రజిత్తు ప్రభావ పరాక్రమాలను గురించి వినగోరాడు. అప్పు డగస్త్యుడు రాముడితో రావణవంశం గురించి ఈ విధంగా చెప్పనారంభించాడు.

కృత యుగంలో బ్రహ్మమానస పుత్రుడూ, రెండో బ్రహ్మ అన దగిన వాడూ



అయిన పులస్త్యుడు ఒకప్పుడు తపస్సు చేసుకుందామని, మేరుపర్వత ప్రాంతంలో ఉన్న తృణబిందుడి ఆశ్రమానికి వెళ్ళాడు. అక్కడ ఆయన తపస్సు చేసుకుంటూ ఉండేటప్పుడు, దేవ నాగ రాజర్షి కన్యలు రోజూ వచ్చి, ఆటలాడి గోల చేస్తూ, ఆయన తపస్సుకు విఘ్నం కలిగించ సాగారు. పులస్త్యుడు తన ఎదటికి వచ్చిన స్త్రీ గర్భవతి అవుతుందని శాపం పెట్టాడు. ఈ శాపం విని కన్యలంతా భయపడి ఆ ఆశ్రమానికి వెళ్ళటం మానుకున్నారు.

ఈ సంగతి తృణబిందుడి కుమార్తె ఎరగదు. ఆమె మామూలుగా పులస్త్యుడి ఆశ్రమానికి వచ్చి, తన స్నేహితురాళ్ళ కోసం వెతకసాగింది. ఒక్కరు కూడా ఆమెకు కనిపించలేదు. ఆమె తిన్నగా పులస్త్యుడు వేదాధ్యయనం చేస్తున్న చోటికి వెళ్ళింది. ఆయన దర్శనం కలగగానే ఆమెలో గర్భ చిహ్నాలు కలిగాయి, శరీర మంతా పాలిపోయింది. ఆమె తనలో కలిగిన మార్పు చూసుకుని ఆశ్చర్యపోతూ, తన తండ్రి ఆశ్రమానికి తిరిగి వెళ్ళి, "నాన్నా నా ఒళ్ళంతా ఎలా మారిందో చూడు. నా స్నేహితురాళ్ళ కోసం పులస్త్యాశ్రమానికి వెళ్ళేసరికి ఇలా జరిగింది. కారణం తెలీదు. నా కేమో భయంగా ఉంది," అన్నది.

తృణబిందుడు పులస్త్యుడి శాపఫలితంగా తన కుమార్తె గర్భవతి అయిందని గ్రహించి, ఆమెను తీసుకుని పులస్త్యుడి వద్దకు వెళ్ళి, "మహానుభావా, ఇది నా కూతురు. గుణవంతురాలు. మిమ్మల్ని వెతుక్కుంటూ వచ్చిన దీన్ని భార్యగా స్వీకరించి, దీనిద్వారా సేవలు పొందండి," అన్నాడు. పులస్త్యుడు సరే నన్నాడు.

తన భార్య గుణాలూ, నడవడీ పులస్త్యుడికి సంతోషం కలిగించాయి. ఆయన ఆమెతో, "నీవు చాలా యోగ్యురాలవు. నీ గర్భాన నా అంతటి కొడుకు కలుగుతాడు.



నేను చేసే వేదపఠనం వింటూండగా గర్భవతి వయావు గనక నీ కొడుకు విశ్రవసు డనే పేరు తెచ్చుకుంటాడు. నా కొడుకు గనుక పౌలస్త్యు డని అందరిచేతా చెప్పబడతాడు," అన్నాడు.

అలాగే కొంత కాలానికి ఆమె గర్భాన విశ్రవసుడు పుట్టి, సత్య శీల శౌచ శాంతాలకు ప్రసిద్ధి పొందాడు. అతన్ని గురించి గొప్పగా విని భరద్వాజ మహాముని తన కూతురైన దేవవర్ణిని తీసుకు వచ్చి అతనికి పెళ్ళి చేశాడు. విశ్రవసు డామెతో గృహస్థాశ్రమం గడుపుతూ ఒక కొడుకును కన్నాడు. ఆ కొడుకు పుట్టగానే బ్రహ్మ స్వయంగా వచ్చి, ఆ కుర్రవాడు ధనాధిపతి అవుతాడని చెప్పి, అతనికి వైశ్రవణు డని పేరు పెట్టి వెళ్ళిపోయాడు.

వైశ్రవణుడికి చిన్నతనం నుంచీ తపస్సే అతి ముఖ్య మనిపించింది. అతను మహారణ్యానికి వెళ్ళి, జలభక్షణా, వాయుభక్షణా నిరహారదీక్షా అవలంబించి, మూడు వేల సంవత్సరాలు కఠోర తపస్సు చేశాడు. ఆ తపస్సుకు మెచ్చి బ్రహ్మ ఇంద్రాది దేవతలతో సహా ప్రత్యక్షమై, "నాయనా, నీ తపస్సుకు సంతోషించాను. వరం కోరుకో," అన్నాడు.



"తాతా, నాకు లోకపాలకత్వమూ, ధనాధిపత్యమూ కావాలి," అన్నాడు వైశ్రవణుడు.

"నేను కూడా మరొక లోకపాలకుణ్ణి సృష్టించే ఆలోచన లోనే ఉన్నాను. ఇంద్ర యమ వరుణులతో బాటు నీవు కూడా నాలుగో లోకపాలకుడివిగా ఉండి నిధుల కధిపతివికా! ఇదిగో, సూర్య ప్రకాశంతో వెలిగే పుష్పక మనే విమానం. దీన్ని ఎక్కి తిరుగుతూ, దేవతలతో సమానుడవై ఉండు," అని చెప్పి, బ్రహ్మ వెళ్లిపోయాడు.

ఇలా బ్రహ్మ వల్ల కోరిన వరాలు పొంది వైశ్రవణుడు తన తండ్రి ఆశ్రమానికి వచ్చి,



"నాన్నా, బ్రహ్మ నాకు వరా లయితే ఇచ్చాడు గాని, నేను నివాసం కల్పించు కోవటానికి చోటు చూపలేదు. ఇతరులకు ఇబ్బంది కలగకుండా నే నుండ దగిన చోటుంటే చూడు," అన్నాడు.

కొడుకు చెప్పిన మాట విని విశ్రవుడు చాలా సంతోషించి, "నాయనా, దక్షిణ సముద్రతీరాన త్రికూటపర్వత శిఖరాన విశ్వకర్మ దేవేంద్రుడి అమరావతిని పోలిన నగరాన్ని, లంక అనే దాన్ని నిర్మించాడు. చాలా అందమైన పట్టణం. అది సువర్ణ ప్రాకారాలూ, పరిఖలూ కలది, వైడూర్య తోరణాలతో కూడుకున్నది. అది మొదట రాక్షసుల కోసమే నిర్మించబడింది, కాని విష్ణుమూర్తికి భయపడి రాక్షసు లా పట్టణాన్ని విడిచి పాతాళానికి వెళ్ళిపోయారు. ఇప్పు డది శూన్యంగా ఉన్నది. దానికి రాజు లేడు. అక్కడ నీ నివాసం ఏర్పాటు చేసుకున్నావంటే ఎవరికీ ఇబ్బంది ఉండదు," అని చెప్పాడు.

వైశ్రవణుడు తండ్రి సలహా ప్రకారం అనేక వేల మంది నైరృతులతో సహా లంకా నగరానికి వెళ్ళి, అక్కడ నివాసం ఏర్పాటు చేసుకుని, సుఖంగా రాజ్యం ఏలుతూ, పుష్పకవిమానంలో అప్పుడప్పుడూ వచ్చి తన తల్లిదండ్రులను చూసి పోతూండేవాడు.



ఇదంతా విని రాముడు ఆశ్చర్యంతో అగస్త్యుడి కేసి చూసి, "మహాత్మా, రాక్షసులు పులస్త్య వంశంలోనే పుట్టా రని విన్నాను. కాని అంతకు ముందు కూడా రాక్షసు లుండినట్టు మీరు చెబుతున్నారు. ఈ రాక్షసులకు మూల పురుషు డెవరు?" అన్నాడు. దానికి అగస్త్యు డిలా చెప్పాడు.

కమలంలో పుట్టిన బ్రహ్మ నీటిని సృష్టించి, దాన్ని కాపాడటానికి కొందరు ప్రాణులను సృష్టించాడు. ఆ ప్రాణులు ఆకలి దప్పుల తోనూ, భయం తోనూ అలమటించుతూ, "మే మేం చెయ్యాలి?" అని బ్రహ్మ నడిగారు. బ్రహ్మ నవ్వుల కన్నట్టుగా, "ఈ జలాన్ని కాపాడటానికి ప్రయత్నించండి," అన్నాడు. కొందరు ప్రాణులు రక్షిస్తా మన్నారు; మరి కొందరు జక్షిస్తా మన్నారు. (జక్షించట మంటే భక్షించటం.) రక్షిస్తామన్న ప్రాణులు రాక్షసు లయారు. జక్షిస్తా మన్న వారు యక్షు లయారు.

రాక్షసులలో హేతీ, ప్రహేతీ అనే ఇద్దరు అన్నదమ్ము లుండేవారు. వారిలో ప్రహేతి తపస్సు చేసుకోవటానికి వెళ్ళిపోయాడు. హేతి అనే వాడు మాత్రం పెళ్ళి చేసుకోగోరి, భార్య కోసం వెతుకుతూ, చివరకు యముడి చెల్లెలు భయ అనే దాన్ని, భయంకర మైన దాన్ని పెళ్ళాడాడు.







బిడ్డ నోట్లో చెయ్యి దూర్చుకుని సన్నగా ఏడవ సాగాడు. ఆ సమయంలో వృషభ వాహనం మీద పార్వతీ పరమేశ్వరులు ఆకాశ మార్గాన పోతూ ఆ పసిగుడ్డు ఏడుపు విన్నారు. ఆ దంపతులు ఆ శిశువును చూసి జాలిపడి, దగ్గిరికి వచ్చి చూశారు. పార్వతి సంతృప్తి కోసం పరమేశ్వరుడా బిడ్డకు తల్లితో సమానమైన వయసూ, చిరంజీవిత్వమూ, ఆకాశంలో ఎగర గల ఒక పట్టణమూ ఇచ్చాడు. పార్వతీదేవి రాక్షసులకు సద్యోగర్భమూ, పుట్టగానే తల్లి వయసూ ఉండే లాగు వర మిచ్చింది.

పార్వతీ పరమేశ్వరుల వల్ల వరాలు పొందిన సుకేశు డనే ఆ రాక్షసుడు ఐశ్వర్యవంతుడై, ఆకాశగమనం గల పట్టణంలో విహరిస్తూ ఇంద్రుడికి సమాను డయాడు.

సుకేశుడు వరాలను పొందటమే గాక ధర్మాత్ము డని కూడా విని, గ్రామణి అనే గంధర్వుడు త్రిలోకసుందరి అయిన తన కూమార్తెను దేవవతి అనే దాన్ని తెచ్చి సుకేశుడి కిచ్చి పెళ్ళి చేశాడు. తన కంతటి భర్త దొరికినందుకు దేవవతి ఎంతో సంతోషించింది.

ఆ దంపతులకు మాల్యవంతుడూ, సుమాలీ, మాలీ అని ముగ్గురు కొడుకులు,

వారికి విద్యుత్కేశు డనే కొడుకు, సూర్య సమ కాంతి గలవాడు పుట్టి పెరగ సాగాడు. వాడికి యౌవనం రాగానే వాడి తండ్రి అయిన హేతి వాడి కొక భార్యను నిశ్చయించాడు. ఆ పిల్ల సంధ్య అనేదాని కూతురు. దాని పేరు సాలకటంకట. సాలకటంకట విద్యుత్కేశుణ్ణి పెళ్ళాడి, భర్తతో సుఖంగా విహారాలు చేస్తూ, గర్భవతి అయి, మందర పర్వత ప్రాంతంలో ఒక కొడుకును కన్నది. అయితే ఆమె కా కొడుకు పైన కన్న భర్తతో విహరించటం మీదనే ఆసక్తి ఎక్కువైన కారణం చేత, కొడుకును కన్న చోటనే పారేసి భర్తతో విహరించ బోయింది.





మూడు అగ్నుల లాటి వారు కలిగారు. వారు మహా బలవంతులు, నిర్భయులు, భయంకరులు. తమ తండ్రి శివుడి వల్ల వరాలు పొందినట్టు తెలిసి, వారు మేరుపర్వతానికి వెళ్ళి, కఠోరమైన నియమాలతో అక్కడ తపస్సు సాగించారు. ఆ తపస్సుకు ముల్లోకాలూ అట్టుడికిపోయాయి. బ్రహ్మదేవుడు ఇంద్రాది దేవతలను వెంట బెట్టుకుని విమానం మీద వచ్చి, "మీ తపస్సుకు మెచ్చాను. ఏం వరాలు కావాలో కోరుకోండి," అన్నాడు.

"దేవా, నీకు మా పైన అనుగ్రహం కలిగిన పక్షంలో, మాకు ఎవరి చేతా ఓటమి కలగకుండానూ, మా చేతిలో శత్రువు లంతా చచ్చేటట్టూ, మేము దీర్ఘాయుష్మంతులమై వర్ధిల్లేటట్టూ వరమియ్యి," అన్నారు వాళ్ళు. బ్రహ్మ వారి కలాగే వరమిచ్చాడు.

ఇటువంటి వరం పొంది ఆ ముగ్గురు రాక్షసులూ మూడు లోకాలనూ పీడించసాగారు. దేవతలూ, ఋషులూ, సిద్ధులూ, సాధ్యులూ, చారణులూ మొదలైన వారికి జీవితం నరకమైపోయింది. వారిని కాపాడే నాథుడు లేడు.

ఆ రాక్షసులు విశ్వకర్మను పిలిపించి, "దేవత లందరికీ నీవే ఇళ్ళు కట్టావని



విన్నాం. హిమాలయం మీద గాని, మేరు పర్వతం మీద గాని, మందరగిరి మీద గాని కైలాసానికి సరివచ్చే టటువంటి అందమైన పట్టణం మాకు కట్టి ఇయ్యి," అని అడిగారు.

"దక్షిణ సముద్ర తీరాన త్రికూట మనీ, సువేల మనీ రెండు పర్వతా లున్నాయి. త్రికూట పర్వతం యొక్క నడిమి శిఖరం మీద ఇంద్రుడి కోరిక పైన లంకా పట్టణం కట్టి ఉంచాను. అది స్వర్గంతో సమానమైనది. బంగారు ప్రాకారాలూ, బంగారు తోరణాలూ కలది. మీరు మీ రాక్షసులతో సహా వెళ్ళి అక్కడ ఉన్నట్టయితే మిమ్మల్ని

ఎవరూ తేరి చూడలేరు," అని విశ్వకర్మ వారితో అన్నాడు.

విశ్వకర్మ చెప్పిన ఈ మాటలు విని ఆ రాక్షసులు చాలా సంతోషం చెంది, అనేక వేల మంది పరివారంతో సహా లంకకు చేరి ఆ నగరాన్ని చూసి పరమానంద భరితులయారు. ఇదే సమయంలో నర్మద అనే గంధర్వ స్త్రీ చక్కని చుక్కల్లాటి తన కూతుళ్ళను ముగ్గురినీ తెచ్చి ఆ ముగ్గురన్నదమ్ములకూ పెళ్ళి చేసింది.

పెద్దవాడైన మాల్యవంతుడి భార్య సుందరి. సుందరి గర్భాన వజ్రముష్టీ, విరూపాక్షుడూ, దుర్ముఖుడూ, సుప్తఘ్నుడూ, యజ్ఞకోపుడూ, మత్తుడూ, ఉన్మత్తుడూ అనే ఏడుగురు కొడుకులూ, అనల అనే ఒక కూతురూ కలిగారు.

సుమాలి భార్య కేతుమతి. సుమాలికి ఆ భార్య అంటే ప్రాణం కన్న ఎక్కువ. కేతుమతికి ప్రహస్తుడూ, అకంపనుడూ, వికటుడూ, కాలకార్ముకుడూ, ధూమ్రాక్షుడూ, దండుడూ, సుపార్శ్వుడూ, సంహ్రాదీ, ప్రఘసుడూ, భాసకర్ణుడూ, అనే కొడుకులూ, పుష్పోత్కటా, కైకసీ, శుచిస్మితా, కుంభీనసీ అనే కుమార్తెలూ కలిగారు.

మాలి భార్య వసుధ అసాధారణ సుందరి. ఆమెకు అనిలుడూ, అనలుడూ, హరుడూ, సంపాతీ అనే నలుగురు కొడుకులు మాత్రమే కలిగారు. వీరు నలుగురూ విభీషణుడికి మంత్రు లయారు.

ఈ విధంగా ఆ ముగ్గురు రాక్షసులూ తమ పిల్లల తోనూ, పరివారం తోనూ లంకలో నివసిస్తూ, ఇంద్రాది దేవతలనూ, ఋషులనూ, నాగులనూ, దానవులనూ బాధిస్తూ, మూడు లోకాల లోనూ తమను నిగ్రహించే వాడు లేక వీరవిహారం చేస్తూ, చావు భయం కూడా లేకుండా, యజ్ఞాలను ధ్వంసం చేస్తూ, వరం పొందిన గర్వంతో తిరగ సాగారు.






ఆదికాలంలో దేవాసురుల యుద్ధం జరిగి నప్పుడు రాక్షసులందరూ ఓడిపోయి, పాతాళంలో దాక్కున్నారు. ఆ సమయంలో శుంభ నిశుంభులనే రాక్షస బాలకులను వాళ్ళ తల్లి దండ్రులు అడవిలో వదిలేసి తాముకూడా పాతాళానికి పారిపోయారు. ఆ అన్నదమ్ములు నరసంచారం లేని అరణ్యాలలో యథేచ్ఛగా సంచారం చేస్తూ, దొరికిన ప్రాణులను పట్టుకు తింటూ, పెరిగి మహా బలవంతు లయ్యారు. రాక్షసులకు సహజమైన మాయా విద్యలు కూడా వారితోనే పెరిగాయి.

ఆ రాక్షసులు బలగర్వంతో సంచరిస్తూ, అడ్డూ, అసాధ్యమూ అనేది ఏమిటో తెలియక, అస్తమానమూ దారుణచర్యలు చెయ్యసాగారు. పెద్దవాడైన శుంభుడు మరీ ఘోరమైనవాడు. వాడు తన బలాన్ని ఏంచేసుకోవాలో తెలియక, పెద్ద పెద్ద పర్వతాలను తన చేత్తో బాది, బాది, వాటిని నేలమట్టం చేస్తూ ఉండేవాడు. అలాగే వాడొకసారి మహేంద్ర పర్వతాన్ని తన కుడిచేత్తో బలం కొద్దీ బాదే సరికి ఆ చెయ్యి కాస్తా ఊడి వచ్చేసింది.

చెయ్యి పోవటంతో శుంభుడి బలంలో మూడువంతులు పోయింది. వాడిప్పుడు వెనకటి లాగా జంతువులను వేటాడలేక పోయాడు. తన శక్తి ఇలా పోయినందుకు వాడికి దుఃఖం కలిగి, తమ్ముడైన నిశుంభుడితో చెప్పుకుని ఏడ్చాడు. అన్న దుస్థితి చూసి నిశుంభుడు, విరిగిపోయిన అతని చేతి ఎముకనే గదగా తయారుచేసి, దాన్ని శుంభుడి కిచ్చాడు. శుంభుడు దాన్ని తన ఎడమచేతికి తీసుకునేసరికి, పోయిన అతని శక్తి అంతా తిరిగి వచ్చినట్టయింది. ఆ గదకు అంతులేని శక్తి ఉన్నది. శుంభుడు దానితో పూర్వంలాగే జంతువులను వేటాడుతూ నిశ్చింతగా తిరగసాగాడు.

---

అట్ట చివరి బొమ్మ

---

శుంభ నిశుంభులు ఏ అడవిలో ఉంటే ఆ అడవిలోని ప్రాణులు కొద్దికాలంలోనే నాశనమవుతూ వచ్చాయి. అందుచేత వాళ్ళు ఒక అడవి నుంచి మరొక అడవికి వెళ్ళసాగారు. ఇలా కొంతకాలం సంచారాలు చేసి వాళ్ళు ఋష్యాశ్రమాలూ, యజ్ఞపశువులూ గల అడవికి వచ్చి, ఆ ఆశ్రమాలను కొల్లగొట్టి, గోవులను చంపి తినసాగారు. వాళ్ళకు ఉత్త అరణ్యాలలో వేటాడటం కన్న, ఆశ్రమాలుండే చోట వేటాడటమే పెద్ద పండగ అనిపించింది.

ఈ రాక్షససోదరుల ధాటికి తట్టుకోలేక కొందరు ఋషులు తమ ఆశ్రమాలు విడిచి హిమాలయ పర్వతానికి పారిపోయారు. మరి కొందరు నృగమహారాజు వద్దకు వెళ్ళి, తమ ఆశ్రమాలనూ, పశువులనూ ధ్వంసం చేస్తున్న శుంభ నిశుంభులను చంపి తమకు శాంతి కలిగించమని కోరుకున్నారు. నృగ మహారాజు ఆ రాక్షసులను చంపి రమ్మని పెద్దసేనను అరణ్యాలలోకి పంపించాడు. సమస్తమైన ఆయుధాలూ గల ఆ పెద్ద సేన శుంభ నిశుంభుల పైకి వెళ్ళి గొప్పయుద్ధం సాగించింది. కాని ఆ సైన్యాన్ని రాక్షసులు నిశ్శేషంగా చంపి, తినేశారు.

ఈ పరిస్థితి చూసి నృగమహారాజు విచారంలో పడ్డాడు. అప్పుడు ఋషులు



ఆయనకు ధైర్యం చెబుతూ, "ఇంత బల వంతులు ఎంతో కాలం ఉండరు. కాలం కలిసి వచ్చినప్పుడు ఒక్క తృణం చాలు వాళ్ళను చంపటానికి. మేము వెళ్ళి ఆ రాక్షసుల దృష్టిని ఇంద్రలోకం పైకి మళ్లిస్తాం. ఆ విధంగా మాకు కొంతకాలం పాటు శాంతి లభించవచ్చు," అన్నారు.

ఆ ఋషులు అలాగే శుంభ నిశుంభుల వద్దకు వెళ్ళి, "మీ వంటి మహాబలులు మీ ప్రతాపాన్ని భూలోకంలో చూపటం ఏమీ బాగాలేదు. చూశారు గదా, మహారాజు ఎంత తేలికగా ఓడిపోయాడో! మా బోటి ఋషులను హింసించి మాత్రం మీరు పొంద గల సౌఖ్యం ఏమిటి? అన్ని సుఖాలకూ మూలమైన ఇంద్రలోకం ఉంది. అక్కడికి వెళ్ళి ఇంద్రుణ్ణి గెలిచారంటే, స్వర్గసౌఖ్యా లన్నీ మీకు దక్కుతాయి," అన్నారు.

ఈ మాట నిశుంభుడికి బాగా నచ్చింది. "నిజమే. ఈ లోకంలో మన పరాక్రమం చూపటానికేమీ లేదు. మనకు నిజమైన జాతిశత్రువు ఇంద్రుడే. అతను మన పూర్వీకులను యుద్ధాలలో ఓడించి, పాతాళ లోకంలో నివాసం ఏర్పరచుకునే గతి కలి గించి, తీరని ద్రోహం చేశాడు. అతన్ని మన గదతో చూర్ణం చేసి పగ తీర్చు కుందాం," అన్నాడు వాడు.





తమ్ముడి ఆలోచనకు శుంభుడు కొంచెం జంకి, "దేవేంద్రుణ్ణి గెలవటం మాటలు కాదు. ఘోరమైన తపస్సు చేసి, గొప్ప గొప్ప వరాలు పొందితేనే గాని ఇంద్రుడి పైన చెయ్యి చేసుకో కూడదు. అతని వద్ద ప్రచండమైన వజ్రాయుధం ఉంది. దాని దెబ్బకు తట్టుకోవటం కష్టం. నిశ్చింతగా ఈ అడవులలో బతుకుతున్న వాళ్ళం, కోరి గొడవ తెచ్చుకోవటం దేనికి?" అన్నాడు.

"ఇంత పిరికివాడ వైపోయా వేమిటి? నీ కంత భయమైతే నీ గద నా కియ్యి. నేను వెళ్ళి ఆ ఇంద్రుణ్ణి హతమార్చి వస్తాను," అన్నాడు నిశుంభుడు. అన్న ఎంతగా చెబుతున్నా వినిపించుకోక, వాడు తన అన్న చేతి గదను తీసుకుని దేవలోకా నికి బయలుదేరాడు.

వాడు తిన్నగా స్వర్గానికి వెళ్ళి, తన గదతో అక్కడి కాపలా వాళ్ళను ఈగలను తోలినట్టు తోలి, అడలగొట్టాడు. వాళ్ళు వెళ్ళి జరిగిన సంగతి చెప్పే సరికి, ఇంద్రుడు తన వజ్రాయుధంతో ఒకే ఒక్క దెబ్బ కొట్టాడు. ఆ దెబ్బతో నిశుంభుడి చేతి గద కాస్తా చూర్ణమై, గాలికి ఎగిరిపోయింది. ఆ దెబ్బతోనే నిశుంభుడు వచ్చి భూలో కంలో పడ్డాడు.

ఒకవంక తాను చెబుతున్నా వినకుండా వెళ్ళి పరాభవం పొంది వచ్చినందుకు నిశుంభుడి మీద శుంభుడికి చాలా కోపం వచ్చింది. "నువు పరాభవం పొందితే పొందావు, నాకు జీవనాధారంగా ఉన్న నా గదను కూడా పోగొట్టావే, అది లేకుండా నే నెలా పొట్టపోసుకుంటాను? ఇక నుంచీ నాకు నువే ఆహారం సంపాదించి పెట్టి పోషించు," అన్నాడు శుంభుడు. తాను అవివేకంగా తన చేతిని పోగొట్టుకుంటే, దానిని ఈ నిశుంభుడే గదగా తయారు చేసి ఇచ్చాడన్నది కూడా అతడు మరిచి పోయాడు. [వచ్చే సంచికలో ముగింపు]



# 45. దక్షిణధ్రువ ప్రాంతాన అగ్నిపర్వతం

ఎరిబస్ అనే ఈ అగ్నిపర్వతం రాస్‌దీవి పైన ఉన్నది. దాని ఎత్తు 13,200 అడుగులు. దీని జ్వాలాముఖం వ్యాసం సుమారు అరమైలు, లోతు 900 అడుగులు. అంటార్కిటికా ఖండం మొత్తం మీద ఇది తప్ప మరొక అగ్నిపర్వతం ఉన్నట్టు కనబడదు.



Photo by Pranlal K. Patel



బహుమతి
పొందిన వ్యాఖ్య

వినుపించగ నీ గానం

పంపినవారు :
కె. రమాబాయి, కాకినాడ

Photo by Madan Gopal



బహుమతి
పొందిన వ్యాఖ్య

వికసించెను నా హృదయం

పంపినవారు :
కె. రమాబాయి, కాకినాడ

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1965 అక్టోబర్ నెల సంచికలో ప్రకటించబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి)

★ ఆగష్టు నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## ఆగష్టు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : వినుపించగ నీ గానం

రెండవ ఫోటో : వికసించెను నా హృదయం

పంపినవారు : కె. రమాబాయి,

C/o శ్రీ కె. గోపాలరావు, కాకినాడ—1

బహుమతి మొత్తం రు. 10/— ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. NAGI REDDI at The B. N. K. Press Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

# కొత్తది! చారలు గల టూత్‌పేస్టు!




# సిగ్నల్

## క్రిమినిరోధక ఎఱ్ఱ చారలు గలది*
## మీ నోరంతటినీ శుభ్రంగా వుంచుతుంది!

❶ మీ పళ్లను శుభ్రపరుస్తుంది ❷ మీ నోటి ఊపిరిని తాజాగా వుంచుతుంది

* ఎఱ్ఱచారల్లో హెక్సాక్లోరాఫీన్ వున్నది

క్రిమినిరోధక ఎఱ్ఱచారలుగల సిగ్నల్ టూత్‌పేస్టు మీ నోరంతటినీ శుభ్రంగా వుంచుతుంది! ఎఱ్ఱ చారలందు హెక్సాక్లోరాఫీన గలదు. సిగ్నల్ మీ పళ్లను శుభ్రపరుస్తుండగా.........చారలలోని హెక్సాక్లోరాఫీన మీ నోటి ఊపిరిని తాజాగా వుంచుతుంది. ఎందుచేతనంటే హెక్సాక్లోరాఫీన నోటి దుర్గంధమును కలిగించే క్రిములను తక్షణం నిర్మూలించే సురక్షిత పదార్థం. ఆశ్చర్యంకాదు, సిగ్నల్ మీ నోరంతటినీ పరిశుభ్రంగా వుంచుతుంది. సిగ్నల్ యందలి ఎఱ్ఱ చారలు, బుడగల నురగ తాజా పిప్పరమెంటువంటి రుచి, కుటుంబములో అందరికీ ప్రీతి. నేడే సిగ్నల్ టూత్‌పేస్టు కొనండి.




...సిగ్నల్ మీ పళ్లను మరియు నోటి ఊపిరిని శుభ్రపరుస్తుంది.

హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ యొక్క విశిష్టమైన ఉత్పత్తి

లింటాస్.SG.2A-77 TL

